# సందర్భ స్వరాలు

కవితీకరణ :

**కవిగారు**

(ఆకునూరు గోపాలకిషన్‌రావు)

'అమ్మకృప'
97 వాసవీకాలనీ
సికింద్రాబాదు - 500003
ఫోన్: 7747882

ప్రచురణ :

విశ్వసాహితి
పోతుకూచి సరస్వతీ పీఠం
6-3-195, న్యూ బోయిగుడ.
సికింద్రాబాదు-3

ప్రతులకు :

పై రెండు చిరునామాలు
ప్రముఖ బుక్ స్టాల్స్.

ముద్రణ :

ఎ-1 ప్రింటర్స్, యం.కె. నగర్,
హైద్రాబాద్-7

April 97

వెల రూ. 30/-

# నా గురించి

"కవిగారు" కలం పేరుతో "కవిగారి స్వగతాలు" నా ప్రథమ కవితా సంకలనం 30 నవంబర్ 96 దినం డా॥ సినారె గారు ఆవిష్కరించారు. నూటికి నూరుపాళ్ళు నా వాళ్ళగురించి వ్రాసుకొన్నదా సంకలనం. నా తొలి రచనలన్నీ అందులో చోటుచేసుకొన్నవి. చూసినవారంతా ఒక క్రొత్త ఒరవడి ప్రక్రియగా తమ సదభిప్రాయం వ్యక్తం చేసినారు.

వరంగల్‌లో పుట్టిపెరిగినవాడిగా నా యీ రెండవ సంకలనాన్ని వరంగల్‌లో ఆవిష్కరించ తలపెట్టినందున ఇదీ కాస్త నూత్న ప్రక్రియగా ఉండాలనే భావంతో 1995-96 సంవత్సరాలలోని అన్ని ముఖ్య పండుగలూ, పర్వాలు, ఉత్సవాలు (రాష్ట్ర జాతీయములతో సహా) ప్రముఖుల జయంతి వర్ధంతి సందర్భాలలో వ్రాసిన కవితలన్నీ యీ సంకలనంగా రూపొంది స్తున్నాను.

నా చిన్నమేనమామయ్య శ్రీ దేవులపల్లి సుదర్శన్‌రావు నేనాయనను "అన్నయ్య" అని పిలుస్తాను. అయన చతుర్భాషా కవి పండితుడు. తన జీవిత కాలంలో అంటే దాదాపు 50 సంవత్సరాలలో ఆయన వ్రాసిన తెలుగు కవితలన్నీ కూడా "సుదర్శన్ రచనలు" గా అచ్చువేసి దానితోపాటు నాయి "సందర్భ స్వరాలు" కూడా అవిష్కరించగలగడం నా మహద్భాగ్యంగా తలుస్తున్నాను. ఓరుగల్లులోని సాహితీ ధురంధరులు శ్రీ యుతులు ప్రజాకవి కాళోజి గారు, కోవెల సంపత్కుమారాచార్యులు, ప్రొ॥ యస్. లక్ష్మణమూర్తి మొదలగువారు ఆయన పుస్తకానికి గొప్ప పరిచయ వాక్యాలు వ్రాసివ్వడం ఆయన నిస్వార్థ సాహితీ సేవకు నిదర్శనం. ఇన్నినాళ్ళకు ఆయన తెలుగు రచనలచ్చవడం అందులో "తమ్ముని తాదాత్మ్యం"గా నాల్గు పరిచయ వాక్యాలు నేను వ్రాయడం నాకెంతో ఆనందంగా వుంది.

ఈ సందర్భంగా నన్ను 1949-50 లోనే కవిగారూ అని పిలిచేవా డైన నా పెద్ద మేనమామయ్య కీ॥శే॥ దేవెరా (దేవులపల్లి వెంకటేశ్వరరా - అయన భవిష్యవాణి నిజమై నేనూ ఓ మిణుకుమను చుక్కగా కవితా కాశంలో కనుగొనబడినతరుణమున నేనాయనకు నా నమోవాకము తెలియచేసుకుంటున్నాను.

రెండు సంవత్సరాలలోని సందర్భోచిత తరుణములపై వ్రాసిన కవి లైనందున వీనిగురించి నేను పెద్ద వివరణ యివ్వనవసరముందని అనుకోను పాఠక దేవుళ్ళకి కవితలు నచ్చుతాయని ఆశిస్తూ వారి ఆదరాభిమాన ఆశీ ర్వాదముల నాకాంక్షిస్తూ

**క వి గా రు**

ఆకునూరు గోపాలకిషన్‌రావు



# అంకితం



కనిపిస్తున్న దేవతలు
కని పెంచిన సహృదయులు
రాధాదేవి- లక్ష్మీనరసింహారావు
కరుణాళులమ్మా నాన్నలు !
మిక్కిలి అభినందనీయులు
మీరు నా గూర్చి కన్న కలలు
మాత్రమే కాకపూర్తి చేసితి
పెద్ద కొడుకుగా బాధ్యతలు !

తీపి తెనుగు యీ మలిరచన
దివ్యులిద్దరికిదే అంకితం !
తీర్చుకోలేనిదిరువురి ఋణం
తేటతెల్లదీ నా హృదయం
ఇద్దరి మధ్యన ఇంపగు బుడుతడు
మా "అమోఘ్" నా మనుమడు
నా రచనల సదా ఆశీర్వదించే
పెద్ద మేనమామ "దేవెర"

కవీశ్వరుడు
—కవిగారు.

# కృతజ్ఞతా చందనము

46 ఏళ్లకు ముందే నా సాహితీ జన్మ నూహించి నన్ను 'కవిగారూ' అని పిలిచిన పెద మేనమామయ్య కీ॥శే॥ "దేవేరా" గారికి,

సాహితీ జన్మ కారకుడు, జ్ఞానధని ఆచార్య 'సినారె' గారికి,

అఖండ ప్రోత్సాహమిస్తూ ఈ సంకలనానికి పరిచయం "సర సందర్భసుస్వరాలు" సమకూర్చిన సాహితీ భీష్ములు డా॥ పోతుకూచి సాంబశివరావు గారికి

ఉరుము లేని మెరుపు వాక్యాలు సిద్ధించిన విజ్ఞులు, పెద్దలు, పూజ్యులు శ్రీ దాశరథి రంగాచార్య గారికి,

"మనసు ని మాట" పలికిన అన్నయ్య శ్రీ దేవులపల్లి సుదర్శన్ రావు గారికి,

అన్నయ్య కాని అన్నయ్య "ఓంకార నాద స్వరాలు" వ్రాసిన శ్రీ పొణుగుపాటి కృష్ణమూర్తి గారికి,

"అభినందన స్వరాలు" పొందిన సంస్కృతాంధ్ర భాషాధని పరమ మిత్రులు శ్రీ మసన చెన్నప్ప గారికి,

సత్సంకల్ప స్వరాలు ఆలపించిన అప్తుడు శ్రీ హరీష్ బాబుకు

ముచ్చటగా పుస్తకం ముద్రించిన ఎ-1, ప్రింటర్స్, మానికేశ్వరి నగర్, ఓ.యు. క్యాంపస్ వారికి, కవర్ పేజీలు, అంకితం పేజీ ముచ్చటగా ముద్రించి యిచ్చిన, అన్నపూర్ణా అఫ్‌సెట్ సంజయ్ సురేందర్‌కు,

నా హృదయ పూర్వక కృతజ్ఞతా చందన వందనాలు

22-3-97

**క వి గా రు**

# సర్వ సందర్భ సుస్వరాలు

కవిగారి సందర్భ స్వరాలు ఇవి. అనేక సందర్భాలలో ఆయన గళం నుంచి వెలువడిన నూత్న భావాలు, విప్లవ భావాలు, ప్రభోదాత్మక భావాలు.

పండగల గురించి వివరాల పట్టికల వ్యాసాలున్నాయి. కాని అన్ని పండగల గురించి కవితలు ఒక సంపుటిలో రాలేదు ఇది కవిగారి క్రొత్త ప్రయత్నం.

ఇందులో తారక రామారావు, చెన్నారెడ్డి, గాంధీ మున్నగు వారు చోటు చేసుకున్నారు వీరు కవిగారి ఆత్మీయులు. జీవితంలో వారి ఆలోచనలలో ఆనందం పంచుకున్నవారు. ఉద్యోగిగా చెన్నారెడ్డి రామారావులతో సన్నిహితంగా మెలిగినవారు. రాజకీయ వేత్తల నిత్యం మారే ప్రకటనలకు, కవిగారి ఆత్మీయ కవితలకు సహస్రంభేదం వుంది.

కవిగారి కలం దూసుకుపోతుంది వేగంగా నిరాటంకంగా కదిలి నడుస్తుంది ఎవరు అడ్డు వచ్చినా ఆగదు ఆ ప్రవాహంలో విద్యుత్తూ ఉంటుంది. ఆయన మాజీ విద్యుత్తు చీఫ్ ఇంజనీరు కనుకనే కాదు, కవిగా ఆయన బలం మెరుపు అటువంటిది.

ఈ కావ్యం నామకరణం విచిత్రం, సందర్భోచితం ఇలా నామకరణం చేసినవారు కవితా లోకంలో అరుదు - కాదు లేరేమో ఇప్పటివరకు. రచనల భావాల ప్రతీకగా నామకరణాలు వెలువడుతాయి కాని కవిగారి గ్రంథ నామకరణంలో విశిష్ఠత కనిపిస్తుంది.

గ్రహణం గురించి కవిగారు అన్న వాక్యాలు సర్వజన ఆచరణీయం

అవరోధాలనధిగమించి
చివరివరకు నిలబడగలగాలి
అలుపు సొలుపు లేకుండా
గెలుపునెపుడు వరించాలి

"అమ్మకృప" నాయిల్లా
"అమ్మేకృప" ధరణికెల్లా

కవితలో అమ్మ భౌతికంగానూ, పారమార్థికంగానూ హృదయాలను కదిలిస్తుంది. చిన్న చిన్న మాటల్లో అనంత అర్థాలు అందించడంలో కవిగారు అనన్యులు.

హిందువుల పండగలతోపాటు మహమ్మదీయులను, క్రైస్తవులను మరవలేదు కవిగారు. వారు అల్లా, ఏసు నినాదాలతో కలిసిపోయారు. కృష్ణుడు నాకు యిష్టుడు, నా ఆరాధ్య దైవం.

'నర్మమైన చమత్కారి
కర్మయోగి ఆ శ్రీహరి
శ్రీకృష్ణుని అవతారాన
మహాగొప్ప మహిమల మారి'

అని కృష్ణుని ఆధ్యాత్మిక, భౌతిక అనంతత్వం, అమోఘత్వం వరించారు.

పదాడంబరంతో, బండి 'ఱ' లతో కవితలు అల్లనక్కరలేదు. హృదయానికి సూటిగా హత్తుకునే భావాల కవితలు మనిషికి మల్లెపూల మాలలు. ఆ రమణీయకత, రణరంగ విక్రమం కవిగారిలో ద్యోతకమౌతుంది

ఇవి సందర్భ స్వరాలే కాదు "సర్వసందర్భ సుస్వరాలు" సాహితీ లోకానికి కవితా వరాలు.

కళాప్రపూర్ణ
**డా॥ పోతుకూచి సాంబశివరావు**

6-3-195, న్యూ బోయిగుడా,
సికింద్రాబాదు - 3
ఫోన్ 7533177

# ఉరుము లేని మెరుపు

కవిగారు, 1895 చివరి తాకా 36 సంవత్సరాలు విద్యుత్ ఇంజనీరు. అక్కడ దీపాలు వెలగడానికి మరలు తిరగడానికి ఉద్యమించారు.

రిటైరు కాగానే అక్షరం మీద ఆసక్తి పెంచారు. ఉరుము లేకుండానే మెరిశారు. 22 నెలల్లో 20 కవితా సంపుటాలు, తెలుగు - ఆంగ్లంలో ఆత్మకథలు వ్రాయడమే కాక "కవితా సంకలనం వెలువరించారు. అదీ వారి అక్షర దక్షత.

ప్రస్తుత మలి కవితా సంపుటిలో వివిధ మతాల పవిత్ర పర్వాలు, జాతీయ దినాలను గురించిన 19 కవితలు కాక ఒక సంవత్సర సందర్భంలో స్పందించి వ్రాసిన మరిన్ని కవితలు విద్యుత్ ఉద్యమ స్వరాలు.

కవిగారు మరిన్ని గ్రంధాలు ప్రచురించాలని ఆశిస్తూ ఆశీర్వదిస్తున్నాను.

**దాశరథి రంగాచార్య**

సికిందరాబాదు
ధాత ఫాల్గుణ
శుక్ల దశమి
18-3-1997

# అభినందన స్వరాలు

స్పందించే సమయంలో స్పందించకపోతే కవి కాలేడు, హృదయ స్పందన అక్షరాకృతి ధరించినప్పుడు అది కవిత్వంగా మారుతుంది. ఆత్మీయులు శ్రీ గోపాలకిషన్‌రావు 'కవిగారి సందర్భ స్వరాలు' వారి సుకుమార హృదయ స్పందనలకు చక్కని ఉదాహరణగా చెప్పవచ్చు.

జాతి సంస్కృతికి పట్టుకొమ్మలైన పండగలే కాక, అప్పుడప్పుడు అపూర్వంగా కనిపించే సంపూర్ణ సూర్యగ్రహణంలాంటి సంఘటనలను కవితా వస్తువులుగా స్వీకరించి కవిగారు సరళ సుబోధకమైన శైలిలో తమ కవితలను అందించినారు.

అనుభవంతోపాటు అభ్యాసంకూడా చిన్నప్పటినుంచి ఉన్నప్పుడే ఆ కవిత రాటుదేలుతుంది. కవిగారు అనుభవజ్ఞులు అంటానికి వారు గ్రహించిన కవితా వస్తువే నిదర్శనం. కాని కవితా పరమైనరచనా వ్యాసంగం ఆలస్యంగా ఆరంభించడంవల్ల భాషలో సాంద్రత లోపించినా భావపరంగా వస్తుపరంగా కవిగారి ప్రత్యేకత కనిపిస్తూనే ఉంది.

'ఆ విడిచిన గ్రహణంలా
అడుగు ముందుకెయ్యాలి
ద్విగుణీకృతోత్సాహంతో
నడుం బిగించి కదలాలి'

మొదలైన పంక్తులు కవితా శిల్పంతోపాటు ప్రబోధాత్మకంగా నిలిచాయి. గ్రహణం తొలిగిన సూర్యునిలా మనం ఎప్పటికప్పుడు సమస్యల వలయం నుంచి బయటపడి పురోగమించాలన్నది కవిగారి ఆకాంక్ష.

కవిగారు ఈ సంపుటిలో పండుగలను వర్ణించినా, వాటి ప్రాశస్త్యాన్ని తెలియజేసినా, కొన్ని పండుగల సందర్భంలో పాటించే ఆచార వ్యవహారాలను నిశితంగా ఖండించారు.

"చంద్రుని చూచినచో
నీలాప నిందలకు
పాల్పడిపోతామని
ఎందుకైనా మంచిదని
ఇల్లువదలి వెళ్ళరు
ఇరవై ఒకటో శతాబ్దంలోకి
బిర బిరా వెళ్తున్నా
మూఢ నమ్మకాలు మన
బుద్ధులందు చూస్తున్నాము". అంటూ అనాదిగా మన మెదళ్ళకు పట్టిన పాచిని తొలగించుకొనే అవకాశాన్ని కల్గిస్తున్నారు. అట్లే భద్రాచలంలో శ్రీరామనవమి నాడు ప్రజలూ ప్రభుత్వమూ సంయుక్తంగా జరిపే సీతా రాముల కళ్యాణంగూర్చి కవిగారు నిర్మొహమాటంగా వెలువరించిన అభి ప్రాయాలను బుద్ధిమంతులెవ్వరూ కాదనలేరు. శ్రీరామునికి పెళ్ళిళ్ళు జరిపే వారికి చురక అంటిస్తూ కవిగారన్న మాటలు గమనింపదగ్గవి.

ఏటేటా ఓ దినము
పెళ్ళి చేసుకుందామని
వీళ్ళా అనరేలనో ?

అంటూనే రాముని గూర్చి 'ఈ పెండ్లితంతు నీకై ఒక శాపమా ?" అని తమ బాధను అభివ్యక్తం చేస్తారు. సాంఘిక మర్యాదలను పాటించ డంలో శ్రీరాముణ్ణి ఆదర్శంగా తీసుకోవడానికి బదులుగా శాస్త్ర విరుద్ధమై ఆచారాలను పాటించడం మంచిదికాదని తెలుసుకోవడం, ఎందుకైనా మంచిదే కదా !

అట్లే 'నాగుల చవితి' నాడు పాములపుట్టల దగ్గరికి వెళ్ళి పాలు పోయడాన్ని కవిగారు

"అజ్ఞానమన్నా కావాలి
అత్యాశన్నా కావాలి
లంచమిచ్చు ఆచారం
లక్ష్యమున్న కావాలి !

అని మన అజ్ఞానాన్ని బట్టబయలు చేశారు. కవిగారి అనేక కవితలు విషయ విశ్లేషణ దృష్ట్యా ప్రశంసార్హమైనవి. వారు ఒక కులానికో, ఒక మతానికో, ఒక సంప్రదాయానికో కొమ్ముకాయదలిస్తే, రంజాన్, క్రీస్తువంటి కవితలు వ్రాసేవారు కాదు.

భాషలు, సంప్రదాయాలు, కట్టుబాట్లు మానవులను తాత్కాలికంగా విడగొట్టినా, మానవులదంతా ఒకే జాతి.

"సమాన ప్రసవాత్మికా జాతిః"— న్యాయదర్శనం, 2-2-66
సమానాకారంగల జ్ఞానాన్ని పుట్టింపగలిగింది జాతి అని అర్థం. కవిత్వం ఎప్పుడూ మానవ సంబంధాలను పెంపొందించేదిగా ఉండాలి. కవిగారి కవితలు ఈ నేపథ్యంలోంచి వచ్చినవే. వీటిని వస్తు దృష్ట్యా ప్రత్యేకమైన విగః గుర్తింపవచ్చు.

కవిగారిది దాపరికంలేని కవితా శైలి. భావాన్ని పాఠకులకు అందించే సందర్భంలో వ్యాకరణాతీతులయ్యారు. కాని సరసులు వారి స్వానుభవాలను వారి సహజ శైలిలోనే చదువుకొని ఆనందించవచ్చు."

"వార్తాపత్రిక కనిపించందే
ప్రపంచాన ఎందరో ప్రక్రమించి లేవరు"

అంటారు, 'వార్త' అనే కవితలో. ఇది మన అనుభవంలో జరిగేదే. కవిగారి ఈ కవితా సంపుటిలో 'కాకతి విభవము' ముచ్చట గొలిపే రచన. ఈ కవితను ఒకసారి చదివితే ఓరుగంటిని చూడనవసరం లేదనిపిస్తుంది.

తమ స్వానుభావాలను "సందర్భ స్వరాలు" గా అందిస్తున్న కవిగారిని మనసారా అభినందిస్తున్నాను.

**మసన చెన్నప్ప**
15-3-97
ఆంధ్రోపన్యాసకులు
ఉస్మానియా విశ్వవిద్యాలయం,
హైద్రాబాదు.

# మనసులోని మాట

చిరంజీవ గోపాలకిషన్‌రావు "కవిగారు" వ్రాయగా సాహితీ భీష్ములు శ్రీ పోతుకూచి సాంబశివరావుగారి ఆశీస్సులతో విశ్వసాహితి, పోతుకూచి సరస్వతీ పీఠము నుండి వెలువడుతున్న "కవిగారి" రెండవ సంకలనము. ఈ కవిగారి "సందర్భ స్వరాలు"

17-3-1995 నుండి 23-1.1997 వరకు గల మధ్యకాలంలో వచ్చిన సనాతన, ఆధునాతన పండగలు, పబ్బాలు, పర్వదినాలు, అన్నిటి గురించి వ్రాసిన వైవిధ్యంగల రచనల సంకలనం ఇది.

'కవిత' వ్రాయాలని కూర్చుంటే వచ్చేది కాదు. అలా వచ్చేదీ, వ్రాసేదీ 'కవిత' ఔతుందో కాదో కాలమే నిర్ణయించాలి.

ఎవరి జీవిత కాలంలోనైనా అతిస్వల్ప కాలం మాత్రమే కవిత వెల్లుబికుతుండన్నది మాత్రం నా వరకు స్వానుభవం.

నేను 1940 నుండి రచనలు చేస్తున్నా నా రచలల్లో అత్యధిక భాగం 1956 సెప్టెంబర్—నవంబర్ మధ్యకాలంలో వ్రాసినవే.

గోపాలకిషన్ రచనా వ్యాసంగం ప్రారంభించిన కొద్దికాలంలోనే నాలాంటి సామాన్యుని ఊహని తబ్బిబ్బు చేసే సంఖ్యలో రచనలు చేశాడు అతడు యేది చేసినా అపూర్వ పద్ధతిలోనే చేయటం అతడి అలవాటు. ప్రస్తుత సంకలనం ఇందుకు సరికొత్త నిదర్శనం!

తినబోతూ రుచులడగటం ఎందుకు?
పుస్తకం తెరిచి చదవటంలో నిమగ్నమవండి!

11-2-97

అన్నయ్య
**దేవులపల్లి సుదర్శన్**

# ఓంకార నాదస్వరాలు

భక్తి, జ్ఞాన, వైరాగ్యములతో విశ్వమానవాళి, సమస్త ప్రాణకోటి, శాంతి సామరస్యములతో మనుగడ సాధించవచ్చునని ఎన్నో శతాబ్దములగ మన దేశమున ఎందరో మహాఋషులు, ఎందరో యతీంద్రులు ఎందరో పరివ్రాజకులు, ఎందరో మహాభక్తులు, తమ తమ ప్రయత్నములలో అనేక సూత్రములను, బోధనలను, సుగమముగ జనావళికందించి సత్ఫలితములను సాధించుచున్నారు. శాంతికాముక దేశములలో మన దేశమునగ్రపీఠమున నిలిపినారు. ఇట్టి ప్రయత్నము నిరంతరము సాగుటకు వీలు కల్పించినారు. అట్టి శాంతియుత సహజీవనమునకు అన్ని ప్రాణు లకు వీలు కల్పించినారు.

అలా ప్రవచించిన సూత్రములు మానవుల జీవన విధానములుగ తీర్చి దిద్ది మానవాళి శాంతియుత సహజీవనమునకు పాటుపడుచున్నారు.

మానవ జీవన విధానమున్న ఎన్నో సూత్రములను సూచనముల జొనిపి వారి వారి పరంపరానుగతముగ వచ్చు వివిధ సందర్భములలో వాటిని ఎట్టి రమరికలులేక అనుసరించు అవకాశము కల్పించినారు. వాటిని పండుగలుగ, పూజా కార్యక్రమములుగ నిర్దేశించినారు. మానవులు సకల భూతములయందు తమవలె సమభావమును ప్రదర్శించుటకు వీలు కల్పించినారు.

అనాదిగ ఈ కార్యక్రమము కొనసాగుచునే యున్నది. ఇది సర్వ కాలీనమై ఆదర్శప్రాయమైనది. తమ తమ బంధుమిత్రులతో, సేవకులతో తదితర జంతుజాలాలతో, సుఖ సంతోషాలతో గడుపుటకు అనేక ప్రచురణ యోగ్యమైన విధివిధానముల నేర్పరిచినారు. ఇట్టి సంవిధానమున స్త్రీలను

కూడా బాధ్యతాయుత భాగస్వామ్యులను చేసినారు. ఆయా పండుగల సంధర్భములయందు స్త్రీలకు ప్రత్యేక స్థానము కల్పించినారు. అట్టి విధానమును ఈనాటికి అనుసరింపజేయుచున్నారు.

అట్టి సందర్భములయందు అందరు కలుసుకొని పరస్పరము వారి వారి భావ విశేషములను తెలియజెప్పుకొని సంతృప్తులగుచున్నారు.

ఈ సందర్భమున ఒకానొక విశేషము చెప్పవలసి యున్నది : భారత దేశ చరిత్రయందు మన జాతి చరిత్ర వ్యవస్థీకరించు సందర్భమున మన పండుగలను గూర్చి విపులముగా ఆనాటి సాంఘిక పరిస్థితులను పరిగణన లోనికి తీసికొని ప్రస్తావించినారు. అందుకు కర్జను మహాశయుని కృషి ప్రశంసార్హముగ నున్నది. (ఎత్నాగ్రఫీ)

అయితే అలా పండుగ శుభ సందర్భములయందు సమావేశములు జరిపి వారి వారి అప్పటి స్థితిగతులను గ్రహించవలసిన సూచనలను గ్రహించి తిరిగి తమ తమ గృహకృత్యములయందు లీనమగుచున్నారు. కాని ఆధ్యాత్మిక అవగాహన ఆచరణ క్రమక్రమముగ లోపమగుచున్నది.

మిత్రులు (కవిగారు) శ్రీ ఆకుసూరు గోపాలకిషన్‌రావుగారు ఆయా పండుగ మరియు ముఖ్య సందర్భములయందు తన మనసున పొడమిన ఆలోచనలకు అక్షరరూపమిచ్చి తన మనోభావములను మన అందరితో పంచుకొనుటయేగాక రానున్న తరములవారికి అందించు కృషిజేసి ధన్యులైనారు

వారి భావ గాంభీర్యమును ప్రతి పదమున నిక్షిప్తము గావించినారు.

వారు తమభావవ్యక్తీకరణచేసిన సందర్భ స్వరములలో బుద్ధజయంతిలో

"మూడు శరణముల మంత్రం
సమాజ శ్రేయస్సుకిదే
చక్కగ ఆచరణ యోగ్యం"

అని ఎలాటి సంశయానికి తావు లేకుండా కొనియాడదగినదిగా చెప్పి నారు. ఇలా ఎన్నో ఉదాహరణలిందున్నవి. ఓంకార నాదమయమైన ఈ విశ్వనాటక ప్రక్రియలో కవిగారి యీ సందర్భ స్వరాలు లీనమై, అంతర్వా హినులై మానవాళి సుఖశాంతులతో మనుగడ సాగించుటకు తమవంతు కృషి సలిపి ధన్యులైనారు. ఇందు ఎట్టి అపస్వరములు అసందర్భములు నాకు పొడగట్టలేదు.

నాయందు ఎంతో ప్రేమతో ఈ మాటలు వ్రాయడానికి అవకాశమిచ్చి నందుకు ఈ కవిమిత్రునికి కృతజ్ఞతాభివందనములు చేయుచున్నాను.

**పి. కృష్ణమూర్తి**
వాసవీనగర్, సికింద్రాబాద్.

10-3-97



# సత్సంకల్ప స్వరాలు

"కవిగారు సందర్భ స్వరాలు" రేపటి తరానికి చక్కటి వరాలు. సృష్టిలో మానవులంతా ఒకే కులం అదే మానవ కులం అనే అంతర్జాతీయ సమైక్యతా భావాన్ని వెలిబుచ్చి విశ్వమానవుడినని పించారు. అన్ని మత ములు పండుగల విశిష్టతను కమనీయంగా వర్ణించినారు. హిందు, ముస్లిం ఈసాయీల నొకరినొకరు అర్థం చేసుకోడానికి మార్గం సుగమం చేశారు. మహనీయులైన జాతి నేతల మరవ వద్దన్నారు. పరమాన్నం తినడమే కాదు పండుగ పరమార్థమిదని నొక్కి చెప్పారు. మూఢ నమ్మకాలను వదులుకోవా లని ప్రాకృచ్చారు. మంచిని పెంచమన్నారు.

మానవ సేవే మాధవ సేవ అని విశ్వ కళ్యాణమే నిరంతర దీక్షగా జీవిస్తున్న పుట్టపర్తి సాయి సేవ గురించి చక్కగా వివరించారు. వారిలా అందరూ నిస్వార్థంగా బ్రతకాలన్నారు. ఓరుగల్లు ఔన్నత్యాన్ని వీడియో లోలా వర్ణించారు.

ఎంతో త్వరితంగా పతనమౌతున్న నైతిక విలువలను అడుగడుగునా గుర్తుచేశారు.

జపనీయుల నాదర్శంగా పెట్టుకుని ప్రగతి పథంలోకి పయనించాలనే కవిగారి ఆతురత అభినందనీయం.

మనమంతా వీరి సత్సంకల్ప సందర్భాలకు ప్రోదినిచ్చి వీరి ఆశయా లలో భాగస్వాములౌదాము.

18.3.1997 **దేవులపల్లి వెంకట హరీష్ బాబు**

హైద్రాబాదు

# సందర్భ స్థావరాలు

# హోళీ

మదనుడు బూడిదైన
మహిమాన్విత దినమాయిది
కామకేళి లాస్యాలకు
కామాయిడు దినమాయిది
రెంటి భావమొకటిగానే
కంటికి కనబడుతున్నది
రెండూ నిజమనుకొనే
దండిగ పాటించనున్నది!
వేసవి రోజులెలాగు
వాసనలకు సరిపడవు
చెమట కంపదెలాగు
చేరనీయదు తనువులను
అందుకని ఆ ఋతువులో
అఖరు సారిగ
మనో మలినముల
మట్టుబెట్టుటకు
రంగులు పోసుకొనే
హంగుల నేర్పరచి
హోళీ మిషతో
పిచికారీలు సంధించి
ఆడా మగా అంతా
వారిని వీరూ వీరిని వారు
రంగులలో ముంచేస్తారు
రంజుగ తమ తమ రంగుల
తనువులు రాచేస్తారు
మగవారంతా కృష్ణుల తీరు
యువతులంతా రాధలతీరు
రంగులందు తడిసిన
రమ్యమైన అందాలను
చూపులతో చేతలతో
రాపాడుకుపోతారు
కర్రలు పేర్చి రాతిరివేళ
కామ దహనము చేస్తారు
వేసవికాలం వెళ్ళేవరకు
వాసనలకు బైబై చెప్తారు!

—17-3-95



# శివరాత్రి

చాల దయామయుడు
భోలా భాలా శంకరుడు
నానా అనర్థులపై
నాల్కకెముక లేనందున
ఇవ్వమని అడుగగనే
నవ్వు ముహంతో
కురిపించి వరాలను
ఇరుక్కొనె చిక్కులలో
ఈ మధ్య వరాలవి
ఇవ్వడం లేదాయేమి
యే కొత్త చిక్కులలో
ఇరుక్కున్నది లేదే
విష్ణుమూర్తి వరాలపై
విధించాడా నిషేధం
లేదా వదిలేశాడా శివుడు
తనదైన భోలాతనం
శివరాత్రిని భక్తితో
చేసుకుంటారు ప్రజలు
పూజలుపవాసాలతో
భజనా జాగరణలతో
మంచివారమైన మనకు
మన శ్రద్ధా భక్తిమేరకు
మన వరాలు తీర్చు శివుడు
దురాశకానంత వరకు !

27-2-95



# రంజాన్

దేవునిపై నమ్మికతో
దినమంతా తినకున్నా
దివ్యంగా అన్ని పనులు
దీటుగ నెరవేర్చవచ్చని
పట్టుదల మానవుల
ప్రధమ గొప్ప లక్ష్యమని
శరీరాన్ని చెప్పుచేతలతో
చక్కగా వుంచుకోవచ్చని
దినమంతా ముస్లిం సోదరులు
ఘనంగా ఉపవాసాలు
పవిత్ర హృదయంతో చేయటం
ప్రబలమైన నిదర్శనం
సూర్యోదయం ముందు తిని
అస్తమయం అనంతరం తిని
రెంటి మధ్య కాలమందు
కనీసం మ్రింగక ఉమ్మిని
ఎంత నిష్ఠగా ముస్లిం సోదరులు
ఉండగలరో పిల్లలు పెద్దలు
వారి దీక్షా విశ్వాసాలు
తెలుపుటకీ నెలే చాలు
మత మౌఢ్యం కానిది
అతి మంచి అలవాటుకు నాంది
మనిషి తన శరీరాన్ని తన
అదుపులో పెట్టు కార్యక్రమమిది
దినమంతా తినకున్నా
శ్రమ యెంతో చేస్తున్నా
శరీరం ఓర్వగలదని చెప్పే
చక్కని ఆరోగ్య సూత్రమిది
రోజంతా ఐదు నమాజులు
వీరాచరించు పూజలు
జుమ్మతుల్ విదానాడు చూడాలి
వీరి గొప్ప సామూహిక నమాజులు
రంజాన్ పండుగ ప్రత్యేకతలు
ఈద్ మిలాప్‌లు షీర్‌ఖుర్మాలు !

3-3-95



# చక్ర భ్రమణం

అంతమనేదే లేకుండా
ఆత్మలెలా మరల మరల
నిత్య నూత్న కాయములను
ఆశ్రయిస్తు వుంటాయో
అరవై మనవత్సరాలు
ఆ విధి తమ పేర్లు మార్చి
వత్సరమున కొక్కసారి
వస్తూనే వుండు కదా
కాల చక్ర భ్రమణ
ఖచ్చితమగు ప్రగతిలో
మరల నొక్క వత్సరము
మనకోసం వచ్చింది నేడు
నిన్న మనల వీడినట్టి
ావ" ఆత్మయే కదా మరి
ది పరకాయ ప్రవేశం
యువ" లోనికి చేసింది
అలాగే మనలందరినీ
యువకులనే కమ్మంది
శరీరానికే కదా ముసలితనం
ఆత్మ యెప్పుడూ యువతకు
సంకేతం

మన బ్రతుకులలో ఇంకోసారి
"యువ" రూపంలో యువతవచ్చె
యువ తెచ్చిన యౌవ్వనంలో
మానవతా మహనీయ
మహిమాన్విత భావాలను
మననం చేసి కొందాము
మనసారా పాటిద్దాము
భారతజాతిని ప్రపంచ జాతులు
ఈర్ష్యపడేలా తీర్చి దిద్దుదాం
యుగ యుగాలు తరతరాలుగా
విరాజిల్లు పరిఢవిల్లు
మనజాతి గౌరవ కేతనం
హిమాలయ శిఖరాల్లో ఎగరేట్టుగ
చూద్దాం!
ఈ విధికాల చక్ర మరవై సార్లు
తన చక్ర భ్రమణం పూర్తిచేసి
బహుధాన్య వత్సరాన్ని
త్వరలోనే తేనున్నది
అంటే అప్పుడే నాకరవై ఏళ్ళా
నమ్మలేని నిజం ఏమి విచిత్రం
అలా నాకనిపించడం లేదే

మనోవాక్కాయ కర్మలందు
నేనింకా యిరవై వాడినే
ఇరవైలో మళ్ళీ ఈ యువ
తెచ్చిన క్రొత్త యువత
ఇంకేం నాలో యువతే యువత
ఇన్నినాళ్ళు నా ప్రజలకు
నా "కాంతిశక్తి" వాడుకదార్లకు
నేనెంతో సేవ చేశానని
కాలంలా ఖచ్చితముగ
నా సేవలు అందించిన
కారణాన నాకెంతైనా
గర్వం ఆనందంగా వున్నా
ఈ యువ లోనే నా ప్రజాసేవ
పరిధి మరీ క్రాకతాళీయంగా
ముగుస్తున్న కాలంలో
నా ఈ యువతను మళ్ళీ
సాహిత్య సేవారూపంలో
నా ప్రజలకు నా జాతికి
అందించాలన్నదే నా ఆశయం
జాతిని చైతన్యం చేయాలన్నదే
నాకున్న సంకల్పం నా దృఢ
నిశ్చయ
ఈ నూత్న వత్సర శుభ ఘడియే
ఆశయ శుభారంభ ముహూర్తం
నాతోనే మీరంతా
నా వారైనాలాగే
"జైహింద్" నినాదాన్ని జాతికంఠ
వినపడేల
మూడే మూడు సార్లు
ముచ్చటగా నినదించండి
జైహింద్ జైహింద్ జైహింద్

యువ ఉగాది 1-4-95



# శ్రీరామ నవమి

అవతారాలు పది
అవైనా మనకున్నవి
అందు రెండే రెండు
అంతగా ప్రాచుర్యం
రామావతారం
కృష్ణావతారం
రామావతారంలో
తండ్రి ఆజ్ఞపాలన
ఏక పత్నీ వ్రతము
రామ రాజ్య స్థాపన
అన్నవి ముఖ్యాంశాలు
అనుసరించగోరు వారికి.
కృష్ణావతారంలో
విష్ణుమూర్తి రసికుడు
దుష్ట సంహారకుడు
ధర్మ సంస్థాపకుడు
విజయుని ప్రియపాత్రుడు
అతని విజయకారకుడు.
రాముడు మన స్త్రీజన
మనోభి రాముడైతే
కృష్ణుడు పురుషులట్టి
కోర్కెలున్నవాడు
వారికి ఎంతగనో
ఆదర్శ పురుషుడు
ఆమాట కొస్తే
శ్రీ రామచంద్రు
డంతగా సీతమ్మను
కష్టపెట్టినా స్త్రీలు
ఇష్టపడతారా దేవుని
ఆదర్శ పురుషుడని
అంతగ పూజిస్తారు
విపరీతమనేంతగా
వేనోళ్ళ పొగడుతారు
రామా శ్రీరామా
అది నీ అదృష్టమే
ఆ తల్లి ఆశీర్వాదమే
తల్లి పెద్దదట కదా
తండ్రీ శ్రీరామా
అందుకే ఆశీర్వాదం
అన్నమాట తప్పుకాదు
ఆడ వారలేగాక

అందరూ జగాన
ఆదర్శుడు రాముడని
అన్నట్లే అంటారు
ఆడవారి నలరింప
అలా కనబడినను
పురుషులు మాత్రం
సరసుడు కృష్ణున్నే
చక్కని ఆదర్శంగా
ఎక్కువగా కోరుతారు
మిక్కిలి అనుకరిస్తారు.
అది యెందుకని నన్ను
అడగవద్దు ఎవరూను
గుట్టు రట్టు చేసుకుని
ఎట్ల బ్రతకగల్గం మేము
రాముని స్త్రీలు పూజించు
రహస్యమది యేమిటో
రాముణ్ణే అడగాలని
నా మదిలో కోరిక
నానా రోజుల నుండి
నలుగుతూనే వున్నది
అందుకిదే అదనుగా
అడిగేస్తున్నాను సుమా

రామా శ్రీరామా
స్త్రీజన మనోభిరామా
సీతమ్మతో పెండ్లి
చేస్తారు యేటేట
భద్రాచల క్షేత్రమందు
ప్రజల్లు విరగబడి చూస్తుంటారు
ప్రభుత్వమే వచ్చి
సేసగ ముత్యాలుచల్లి
దగ్గరుండి మీ పెళ్ళి
దర్జాగా జరిపిస్తది
తమ ధర్మం అనుకొని.
అదికాక ఎల్లెడల
జరిపింతురు మీ పెళ్ళి
ఊరూరా వాడవాడ
ఘనంగా గర్వంగా
అయినా నాలాంటివారు
సరసుడు ఆ వెన్నుని
పేరు కలిగి వున్నవాళ్ళు
పెద్ద బుద్ది కలవాళ్ళు
రామునిలా రమ్యముగా
యేకపత్నీ వ్రతులైనా
పూవులలో పెట్టి

పూజించినా సతులను
చీటికి మాటికి వారు
నీ పేరే ఎత్తుతారు
మా కాంతలకెప్పుడూ
మనసులోన నీపేరే
నీమీద నాకు ఈర్ష్య
నిక్కముగా చాల వుంది
నేనూ నీలా అవతార
పురుష నామధేయుణ్ణనా ?
మనము కూడ అలాగే
ఏటేటా ఓ దినము
పెళ్ళి చేసుకుందామని
వీళ్ళా అనరేలనో
లేదా ఈ పెండ్లి తంతు
నీకై ఒక శాపమా ?
నీవా సీతమ్మ
నేడిస్తించిన ఫలితమా ?

సీతమ్మను వదిలినందుకు
చిన్న దండనా నీకిది ?
యుగయుగాలు
సీతో పెళ్ళి జరిపి
నీ అఘాయిత్యాన్ని
నీకు గురుతు చేయుటా ?
నీవేక పత్నీవ్రతుడని
సీతమ్మ బాధలేవి
చెవిని పెట్టకున్నా
నిన్ను తలుతురు
మా యీ సన్నుతాంగ
సంసార స్త్రీజనులు.
మనలో మన మాటగ
మాకీ నీ రహస్యం
చెవిలోనైనా సరే
చెప్పవయ్య శ్రీరామా !

★★

# లోకుల మతం

హిందూ ముస్లిం అల్లర్లు
ఎందుకు వస్తాయన్నది
ఇంతవరకు ఎవరు కూడ
ఇదమిద్ధంగా చెప్పలేని
మరల మరల వచ్చు తెగులు
బట్టబయలు రహస్యం
ఏ హిందూ ఏ ముస్లిం
ఏనాడైనా ఎపుడైనా
కోరుకోరు ఒకరినొకరు
కొట్టుకొని చావాలని.
వారి వారి మత విషయక
భావాలవి ఎటులున్నా
కలిసి మెలిసి బ్రతుకుటనే
బలముగా అభిలషిస్తారు
అల్లరులు జరిగినపుడు
ఆ వైపూ ఈ వైపూ
ఆడా మగా పిల్లా పాపా
తేడా అనేది లేకుండా
ప్రాణాలను మానాలను
పదిలమైన ఆస్తులను
పోగొట్టుకు కుమిలిపోయి
అన్నార్తులై అనాధలై
అల్లలాడు తారు కదా ?
ఈ దీన పరిస్థితిని
ఎవడు కోరు తానుగా ?
ఈ మారణ హోమంలో
ఎవడు చేరు తానుగా ?
కొంతమంది మత మౌఢ్యులు
దుర్మార్గులు దేశద్రోహులు
స్వార్థపరులు సన్యాసులు
ఉన్మాద దురుత్సాహులు
ఏదో ఓ కుంటు మిషతో
దేశంలో ఎచ్చోటో
తమ స్వార్థం కలిసిరాను
తమ పబ్బం గడుపుకోను
కూటికి మొహం వాచిన
కొందరు సోమరి పోతుల
మొహాలపై డబ్బులు చిమ్మి
మొహరము నల్లుకొని
అల్లర్లను సృష్టిస్తారు
కళ్ళబడరు వారెవరికి.
హింసా దౌర్జన్యాలూ
దోపిడీ దహన కాండలు

రెచ్చిపోయి పెచ్చుమీరి
పిచ్చి పిచ్చిగా చేయిస్తారు
ప్రజల అస్తులు బూడిదలై
ప్రజల బ్రదుకులు బ్రద్దలై
ఆ రోదనలూ ఆక్రందనలూ
అంటుతాయి గగనాన్నే
మొన్న మూడు యేండ్లక్రింద
ముంబయిలో జరిగెనిదే
ఎంత ఆస్తి ప్రాణ నష్టం
వింతగ ఆరోజు జరిగె
ఇన్నాళ్ళు అయినా కూడా
ఏంచేశా మెవ్వరినీ ?
యేండ్లకొద్దీ పూండ్లకొద్ది
ఇదేకదా జరుగుతోంది
దీన్ని ఆపగల్గు శక్తి
ఒకే ఒక్కటా వ్యక్తి
కులాలన్ని కుప్పపోసి
మతాలతో పూడ్చివేసి
దేశ జనాభానంతా
ఒకే కులం ఒకే మతం
మనది లోకుల మతం
అనేలా తీర్చిదిద్దడం

29-4-95

(బొంబాయి హైద్రాబాదులలో జరిగిన హిందూ ముస్లిం అల్లర్లపై)



# మే డే

ప్రపంచ కార్మికులకు
పండగ దినం మేడే
కార్మికుల ఐకృతకు
కనులవిందు నేడే
దైవశక్తి తరువాత
శ్రమ శక్తే వున్నతం.
దేశవృద్ధి చక్రాలను
దీటుగ తిరిగించే
శ్రమశక్తి ఆశయాలు
గమనార్హం ఎంతైనా
కార్మికుల సంఘటన
వారి కఠిన పరిశ్రమ
వారి దీక్షా దక్షతలు
వారి శక్తియుక్తులూ
జాతికి కావలసిన
చక్కని అవసరాలు
అంకితముగ కార్మికులు
ఇంకా ఇంకా పనిచేయగ
ఈ పండుగ దినంనాడు
పునరంకిత మవ్వాలి
పుష్కళంగ దేశానికి
పురోభివృద్ధి తేవాలి! 1-5-95

# హనుమజ్జయంతి

ఇతరులిదని చెప్పువఱకు
తన బలము తెలియదు తనకు
మహాబలుడని మనమనుకొనే
మన బ్రహ్మచారి హనుమకు !
ఎవరెవర్ని పొగిడినా చాలా
"రొమ్ము చీల్చి ఆంజనేయునిలా
శ్రీరాముని చూపించిన రీతి"
అని పోలుస్తారు వారినలా !
పిచ్చిభక్తి నిదర్శనం
చిచ్చు లంకకు తన వాలం
భయాలన్నిటి కభయం
భలే శ్రీ అంజనేయం !
కోతిని వింతగ చూసే మన
కుర్రాళ్ళకు హనుమంతుడనిన
మహాభక్తి ప్రపత్తులే కాక
భయం బలోపేతుడనిన !
అంజనేయ దండకం
అబ్బినందరికి కంఠస్థం
భయం తునాతునకలై
భలేగా చేకురు ధైర్యం !
పిన్నలూ పెద్దలందరు
విధిగ తాము కొలుస్తారు
అహారమూ హనుమను
అభయ హస్తము పొందుతారు
సూర్యునినే మ్రింగ
చూచినట్టి విహంగ
శక్తుడు హనుమంతుడు
సదా చూచు మనల చల్లంగ !

12-5-99

# బక్రీద్

మొహమ్మద్ మత ప్రవక్త
ముద్దుతనయుడిస్మాయిల్‌ను
అల్లా బలికోరగ మొహమ్మద్
విలవిల్లాడి యిదేమని
కాస్త వెనకముందైనా
తనయుని బలి తప్పదని
అల్లా ఆజ్ఞ మీరలేక
చెల్లించిన దినమే బక్రీద్
ఇస్మాయిల్‌కు బదులల్లా
బక్రీని బలిగొన్నదే బక్రీద్.
ప్రవర్తనకు అల్లాపైగల
ప్రబల విశ్వాసానికి ప్రతీక.
అల్లా అదిమెచ్చి తనడిగిన
బలి తప్పించిన గొప్పహేల
ఎంతో సంతోషంతో
అల్లా చేసిన అద్భుతాన్ని
ఇల్లా యేడాదికోసారి
ఈ ఆనంద సంధర్భాన్ని
గుర్తుచేసు కొంటుంటారు
గొప్పక పండగ చేసుకుంటారు
అల్లాపై విశ్వాసం
ఎల్లాటి ఆర్తినైనా
తీరుస్తుందన్నదే
వీరి గాఢ విశ్వాసం!
పిల్లా పెద్దా అంతా
సల్లాపాలతో సంబరంగా
గడుపుతారు దినమంతా
గలాలు మిలాయింపుగా!

10-5-95

# మిలాదుల్ నబి

ఇస్లాం ప్రవక్త మహమ్మద్
జన్మదినం మిలాద్‌నబీ
ముస్లింలంతా పండగ
మురిపెంతో ఆచరిస్తారు.

9-8-95

# బుద్ధ జయంతి

"మహావృక్షమైతే ప్రపంచం
బుద్ధ దేవుడే దాని బీజం"
బుద్ధుని అనుయాయులకిది
బీజాక్షర యుక్త మంత్రం :
కష్టములే చూడకలగని
అష్టయిశ్వర్య జాతకునిని
విధిమార్చెను బుద్ధునిగా
ఆ శుద్ధోదను కొమరుని :
కారణ జన్ముల కందరి
కోరణము బ్రదుకు
కష్టాలను వారు కోరి
ఔతారు దూరం సుఖాలకు :
బౌద్ధమార్గం స్థాపించి ప్రజల
మహాసమ్మతము పొంది ప్రబల
మగు రీతి దాన్ని విస్తరించి
అయెను గౌతముడు సకలబల
బోధి వృక్షము క్రింద
బుద్ధుడై నిలిచెను
విశ్వవ్యాప్తి చెందునటుల
ఆ మతమును నిలిపెను :
బుద్ధం ధమ్మం సంఘం
మూడు శరణముల మంత్రం
సమాజ శ్రేయస్సుకిదే
చక్కగ ఆచరణ యోగ్యం :



# మొహర్రం

మతమౌఢ్యులు కొందరు
మత ప్రవక్త మహమ్మదు
సంతతిని సమూలంగా
పది రోజుల యుద్ధంలో
అంతం చేసిన దుర్దినమే
పదవ రోజు మొహర్రం
అందుకనే ఈ దినాలు
త్యాగాలను గుర్తుచేసుకొని
గడుపు శోక సంతాపదినాలు
అతి దుఃఖంతో వీరు
లోలోపల బాధ పడుతూ
చాలా నిశ్శబ్దంగా గడుపుతారు
మౌనంగా మృతుల స్మృతిని
మననం చేసుకుంటారు
వారికి శాంతి చేకూరాలని
వీరంతా కోరుకుంటారు !
మతంపై ప్రేమలాగే
వీరికున్న నిష్ఠ మిన్న
ఆచరింతురతి గౌరవంగా
ఏ రీతి రివాజన్నా !

9-6-95



# హిరోషిమా డే

ప్రపంచ యుద్ధాలు రాక్షస
ప్రవృత్తికి నిదర్శనాలు
రెండవ ప్రపంచ యుద్ధంలో
మెండుగ హిరోషిమాలో
కురిపించిన అణుబాంబులు
కుబుద్ధికి తార్కాణాలు
యాభై యేళ్ళయినా
యధాస్థితికి రాలేదు
అణుబాంబుల విషదాడికి
ఆహుతైన ఆ ప్రదేశం.
అది జాపానైనందున
ఆ మాత్రం తట్టుకుంది
జపనీయుల దేశభక్తి
అంత గొప్పదైనందున
దే వేరు దేశమైన
సలే కోలుకోలేక
అస్తవ్యస్థమై వ్యవస్థ
అణగారి పోయెడిది.
కణకణ అణు అగ్నిలో.
అణుశక్తి ఘోరముతో
అయినట్టి శిధిలాలను
అట్టే పెట్టి ప్రదర్శనకు
ఆ చుట్టు ప్రక్కలను
ఎంతెంతో దీక్షాదీక్షతతో
మరెంతో అందంగా
తీర్చిదిద్దగలిగారు
తేరుకోగలిగారు
మహా ప్రపంచ యుద్ధం
మాటే మరి రాకుండా
ప్రపంచ దేశాలన్నీ
పాటుపడాలి దీక్షగ
మారణాస్త్రాలన్నిటిని
మట్టిలోన కలిపేసి!

6-8-95



# రాఖీ పౌర్ణమి

అన్నాచెల్లెళ్ళ
అనుబంధానికి
ఐనది ప్రతీతి
శ్రావణ పౌర్ణమి.
అక్కా చెల్లెళ్ళకు
రక్షణ వహించుటకే
అన్నా తమ్ములకు
అక్కాచెల్లెళ్ళు
రాఖీ పౌర్ణమినాడు
రక్షా బంధనము.
రాఖీ కట్టించుకొని
రక్షకు తామున్నామని
రక్ష కట్టీనాక కాస్త
రొక్కము చెల్లించుకొని
నొక్కి వక్కాణింతు
రక్కా చెల్లెళ్ళకు !
తండ్రీ మొగుడూ
తనయుడు రక్షగా

ముగ్గురు మొనగాళ్ళు
ముందే సామెతలో వున్నా
ఇంకా ఇంకా ఓ
అన్నా తమ్ముసికూడా
రాఖీ కట్టీ తమే
రక్షణ కోరుకుంటూ
స్త్రీ స్వాతంత్ర్యమో
రామచంద్రాయని
చిత్రంగా చేస్తారు
చిలువలు పలువలు
స్త్రీవాద కవితలు
స్త్రీజన కవయిత్రులు.
అబలలు కామనుకొనే
సబలాంగనామణులు
ఏమి యీ విచిత్రం
ఎంత దారుణ దుర్బలం !

10-8-95



# స్వాతంత్ర్య దినం

అర్ధరాత్రి స్వతంత్రం
అవతరించిన దేశం
చీకటి పనులనే నేతలు
చేస్తున్న మన దేశం !
వెలుగెన్నడు రావాలీ
ఈ నేతల వెలివేయాలీ
ప్రజల బ్రదుకులు మెరుగై
ఈ దేశం బాగు పడాలీ !
యధారాజా తథా ప్రజా
అన్నదే ఆదర్శంగా
నేతల దారులలోనే
ఈ తరాల ప్రజలు కూడ
నీతిని పూర్తిగ వదిలి
భీతిల్లక చెడునెంతో
చేవతోడ ఆచరించి
చేయుచుండి రన్యాయాలు
ఈ రీతి రాజులు ప్రజలు
భారీగా అన్యాయాక్రమాలు
పగలు రాత్రులు చేస్తుంటే
ప్రజాధనం మింగేస్తుంటే
అర శతాబ్దమైనా స్వతంత్రం
అంతగ మేలు చేయకుంటె
అందరము సిగ్గుతోడ
అవనత శిరస్సులవ్వాలి !

★★

# కృష్ణాష్టమి (జన్మాష్టమి)

చిలిపివాడు మన శ్రీకృష్ణుడు
చెప్పలేనంత అదృష్టవంతుడు
అష్టమహిషులు కాకుండా
అరవై వేల గోపికాలోలుడు ;
అంతగ గీతాబోధ చేసి
అర్జునుని బాధ దూరం చేసి
గెలుపొందగ పురికొల్పెను
మహాభారత రణం చేసి !
నర్మమైన చమత్కారి
కర్మయోగి ఆ శ్రీహరి
శ్రీకృష్ణుని అవతారాన
మహాగొప్ప మహిమల మారి !
అందుకే యుగయుగాలు
ఆయన పేరు తలవడాలు
ఆయన జన్మాష్టమి దినాన
మనం పండగ జరపడాలు !
ఆయనలా ధర్మ సంస్థాపన
మనమందరమూ చేయాలనిన
మనకూ కావాలో వీరుడు !
అయనకు లా అర్జునుడు !
అపుడు మనమూ ఈ ఇల
భారతదేశ కౌరవుల
సమూలంగా మట్టుపెట్టి
సంరక్షించగలం మన బీదల !

17-8-95



# వినాయక చవితి

విఘ్నాలకు అధిపతి
వినాయక గజమతి
ప్రారంభాలన్నిటికీ
ఆరంభ పూజాధిపతి !
ఆయన కార్యాలలోనన్నీ
అడ్డులను తొలగించి
సక్రమంగా పనులన్నీ
సాగిస్తాడని తలంచి
ఆయనను పూజించనిదే
ఆరంభించరే పూజలు
ఆయన ఊసులేనిదే
అవవే ఆవిష్కరణలు
భక్తితో భయముతో
భక్తులంతా తమ మదిని
ఆదరాభిమానాలతో
ఆరాధిస్తారు ఎలుక వాహనుని !
చవితినాడు మనం

చంద్రుని చూచినచో
నీలాపనిందలకు
పాల్పడి పోతామని
వినాయక వ్రతకల్పం
విశిష్టంగా ఒనర్చి
అక్షింతలు చల్లుకొని
ఆ ఆపద మరుస్తారు !
ఇంకా జనులు కొందరు
ఎందుకైనా మంచిదని
ఇల్లువదిలి వెళ్ళరు
చంద్రుడగపడతాడని.
ఇరవై ఒకటో శతాబ్దంలోకి
బిరబిరా మనం వెళ్తున్నా
మూఢ నమ్మకాలు మన
బుద్ధులందు చూస్తున్నాము !

29-8-95



# గురు పూజోత్సవం

గురుర్బ్రహ్మ
గురుర్విష్ణు
గురుదేవో
మహేశ్వరః
గురుసాక్షాత్
పరబ్రహ్మ
తస్మైశ్రీ
గురవేనమః
గురువు గురుతకివి
గొప్ప ప్రశస్తి పలుకులు
గురువులేక ఎవ్వడూ
గొప్పతనం పొందలేడు.
గురువే మానవులకు
గొప్ప మార్గదర్శి.
ఒకనికి ఒకే గురువు
పూర్వకాలమందు
ఇప్పుడైతే ప్రతివానికి
ఎందరో గురువులు.
మంచెక్కువైతే
మజ్జిగ పలుచన
అన్న మన నానుడి
ఈనాటి గురుశిష్యుల
అనుబంధానికి
ఘనమైన నిదర్శనం.
అందరిలో ఒక్కరైన
గొప్ప గురువన దగ్గవారు
ఉంటారా అని మనం
నిక్కచ్చిగా నిర్ద్వంద్వంగా
చెప్పలేని నిజం
గొప్ప గురువులే శూన్యం.
అందుకనే ఆదర్శం
అవసరమనుకోవడం.
సర్వేపల్లి జన్మించిన
సెప్టెంబర్ ఐదు దినం
జరుపుకోవడం
గురు పూజోత్సవం
ఎందరాయన ఆదర్శం
పాటించి ఎదుగుతున్నారు ?
ఎందరు తమ కర్తవ్యం

అందంగా నిర్వహిస్తున్నారు ?
లేదన్న చేదు నిజం
జగమెరిగిన సత్యం ?
గురువులెందరో
పురస్కారాలను
కొనుక్కొంటున్నా
రను వాస్తవం
అందరికీ తెలిసిన
అతి గొప్ప రహస్యం !
కథలు కథలుగా
వినవస్తున్న సత్యం
ఏ ఆదర్శ గురువూ
ఏ గొప్ప పురస్కారం
ఏనాడూ పొందిన
దెన్నడూ లేదు పాపం
ఆదర్శాలు హతమీ రోజుల్లో
అన్యాయాల చేతుల్లో!

5.9.95



# రేరాజుగా

నారా చంద్రబాబు
నాయుడు మన సీ.యం.
రేరాజయి చల్లగ
ఈ ఈష్టాగ్నిన్నేలు గాక !

# జాతిపిత

వంద యిరవై ఐదు
వత్సరాల క్రితము
పోరుబందరులోన
పుట్టెనో అర్భకుడు,
సదాచార సంపన్న
షావుకారు బిడ్డడు
మోహన దాసుడు
కరంచంద్ గాంధీ.
బాల్యమంత గడిచె
ఆటపాటలందే
లండనెళ్ళిపోయి
లా తాను చదివాడు.
ఆఫ్రికా వెళ్ళి అచట
ప్రాక్టీస్ చేసినాడు
ప్రశంసలు పొందాడు.
నల్లవారి నచట నాడు
నానా విధాలుగా
తెల్లవారు పెడుతున్న
తిప్పళ్ళు హింసలకు
తెగ బాధపడ్డాడు
తీవ్రముగా పోరాడాడు
తెల్లదొరలతో నచ్చట!
తన మాతృ భూమిలో
స్వాతంత్ర్య పోరాటం
సమయమాసన్న
మైనదని భావించి
మనదేశ మొచ్చాడు
తను లీడరైనాడు!
ఇతర లీడరులెల్ల
ఈయన మాటపై
అహింసోద్యమం
ఆచరించినారు.
ఆంగ్ల పాలకుల
అన్యాయ పాలనలో
నేతలెందరో సార్లు
సీల్గిరి జైళ్ళల్లో
సత్యాగ్రహాలు
శాంతి పోరాటాలూ
నిరాహార దీక్షలూ
నిర్వహించినా గాని

తెల్లోడి కుళ్ళు బుద్ధికి
వాడి కపట న్యాయానికి
సేతలెందరో మంది
వీర మరణం చెంది
స్వాతంత్ర్య సిద్ధికి
అసువులు వీడిరి
చివరికి ఓనాడు
15 అగష్టు 1947 న
ఆనాటి అర్భకుడే
ఆ గాంధీ మహాత్ముడై
కటివస్త్ర ధీరుడై
నిర్భీతిగ మొనగాడై
ఆంగ్ల సామ్రాజ్యాన్ని
పడల గొట్టినాడు!
ఆంగ్లేయ ముష్కరుల
తరిమి కొట్టినాడు!
శతాబ్దాల దేశ దాస్య
శృంఖలాలు త్రెంచివేసి
స్వాతంత్ర్యం తెచ్చినాడు
జాతిపిత ఐనాడు!
భారతీయుల హృదయాలలో
భళిర సదా నిలిచియుండు
భారతదేశ విధాత
అమరజీవి గాంధీతాత!
(గాంధీగారి 125వ జన్మదినం
సందర్భంగ)

2-10-95



# అమ్మ ఆదర్శం

"అమ్మకృప" నాకుల్లా
"అమ్మ" కృప ధరణికెల్లా
చెడుపై మంచి గెలుపే
కడు సమాజం అని తెలిసే
విజయదుర్గ మనకండగ
విజయ దశమి మన పండుగ!
చెడును సదా చితగ్గొట్టి
మంచిపునెడు నిలబెట్టి
మనం నడచి మాతవోలె
ఘన విజయాల్సాధించాలె!
అమ్మకు తగు బిడ్డలమైన
ఆదర్శ దేశ పౌరులమైన
ఆమెలాగ చిరకాలం
అవనియందు నిలువగలం
అనురాగం నైర్మల్యం
అనునవైతె మన ఆధర్శం
ఆదిశక్తి పరాశక్తి
అమ్మ అయితే అదర్శం
ఎవరినైనా గెలువగలం
భువికి స్వర్గాన్ని దింపగలం
శరన్నవరాత్రుల సరదా
తీర్చుకోగలం మనం సర్వదా!

యువ విజయ దశమి 3-10-9



# హృది దివ్వెలు

నరకాసుర వధ జరిగినది
దుహంకారమది అణిగినది
భరతజాతి పండుగ రోజిది
విరియు దివ్వెల కాంతి దినమది
దీపావళి పర్వదినాన మన
పాపాలను చేద్దాం క్షాళన
లేదా ఎపుడో ఓ సత్యభామ
రాదా మన నరకతదునుమ !
ఆమె చంపి అహంకారిని
ఆ రీతిగ వెలుగొందెను
మనచుట్టూ మనలోన
మసలుతున్న దురంతాలు
ఇన్నా అన్నా కొన్నినా
అన్నిటిని ఒక్కొక్కటిగా
ఆయమవలె తలొకటిగా
మనంకూడ వధించాలి
మనమెందుకు వదలాలి
మనంకూడ ఆమెలాగ ఓ
ఘనకార్యం తప్పక చేయాలి
ఆ పద్ధతిలోనే మనం ఓ
దీపావళి స్న్ ంచాలి
మన యింట - యింటిముందు

ఘనకాంతుల కనులవిందు
సరియే అది కాదననైనా
ఇరుల బ్రదుకులలో కొంతైనా
కాంతినింప ప్రయత్నించ
బ్రదుకు ధన్యమనిపించు
(స్వార్థమనే చీడపురుగు
వ్యర్థం చేయును మన బ్రదుకుల)
అపుడు చూడు ఆ ఆనందం
ఔనుకదా వర్ణనాతీతం
చుట్టూ కాంతులెన్ని మనం
శోభలీన నింపుకున్నా
చిరుచీకటి మదినుంటే
ఒరగదెపుడు మనకేమీ
డబ్బు తగలపెట్టి మనచుట్టూ
గబ్బు వాసనలు నింపేకన్నా
మన హృదిలోన నింపి వెలుగుల
అండగా నిలిచి ఇతరుల
గుండెలలో నింప వెలుగులు
ఉండిపోదుమందుననే మనం
దండిగ ఇతరులు తలచిన
మెండుగ మనమది వెలుగును
గుండెలంతు అ వెలుగులు
ఉండుకదా ఎల్లప్పుడు
పండుగ దీపావళిదైతే
రెండెకదా రోజులుండు.

దీపావళి 23-10-9

# నభో విభ్రమం

అంతరాళ మంతటికీ
ఆదిత్యుడె సర్వబలుడు
అతని కాంతితో వెలిగే
అర్భకుడా సోముడు
వింతకదా ఆదిత్యుని
కొంతసేపు కప్పివేసి
అంతటి ఆ కాంతిని
సుంతయు లేకుండచేసి
సంపూర్ణమౌ గ్రహణ
సంభ్రమం కల్గించడం
పదిహేడు వందల 76 తర్వాత
పందొమ్మిదివందల 95తో మళ్ళీ
ఇరవైనాల్గు అక్టోబర్
నరకాసుర వర్ధంతినాడు
పరిపూర్ణ సూర్యగ్రహణం
మురిపెం మనకు కలిగించె
గ్రహణాది నుండి సూర్యుడు
క్రమక్రమముగ క్షీణించుట
కనులకింపుగ కలిగించెను
గగనంలో చీకటులు చిమ్మగ

చివరికి ఆ సూర్యుడు తానో
చిన్నగీతగా అగుపించెను
అంతటి సంపూర్ణ గ్రహణం
సుంత అద్భుతమనిపించెను
ఎంతో చిన్న ఆ చంద్రుడు
అంత పెద్ద అ సూర్యుని
అసాంతంగ కప్పివేయ
కలిగినాడౌ. క్షణ మాత్రమైన
భూమికి వారున్న దూరాలు
సోమాదిత్యుల పరిమాణాలు
అనులోమ నిష్పత్తులలో
మనుటయే ఈ విభ్రమ కారణం
అట్టితరి కరోనా కాంతుల
వెట్టివని వర్ణించగలం
కనులవిందు చేసే కాంతుల
కలంతోనెలా దిద్దగలం
కుంచెతోడనే కదా అది
కొంచెమైన చూపగలం
గ్రహణం వీడే తొలి క్షణమందు
కనిపించిన ఆ డైమండ్ రింగు

క్షణమే క్షణ కాలముండె
మన అందటి కనుల ముందు
అది చూచినవారలదే కదా
అదృష్టం అనుకొందాం మరి.
గ్రహణం పట్టిన దానికి భిన్నం
క్రమముగా గ్రహణం విడవడం
అమావాస్య దినం దీపావళి
ఆశ్చర్యం యేముందందున
అనాడే ఆదిత్య గ్రహణం
అరుదుగ వచ్చే సంభవం,
అదే అసలు సిసలు అద్భుతం
మనం చూసిన మహాద్భుతం
అది కొందటికి మాత్రమే
పదిలమైన అనుభవం
అరుదైనవి చూడటయే
అదృష్టం అనుకుంటే!
ఎన్నటికో తిరిగి కనుట
ఇంత విభ్రమం మింట
ఎందరికో కనుల విందు

ఈ రీతిగ కలుగు ముందు
కాంతిశక్తి గ్రహరాజుకె
కొంతసేపు గ్రహణం తప్పదు
ఎంతటివారమైనా మున ముందు
ఇంతలేసి అర్భకులం మనం
ఇహ మనకుకూడ ఎడనెడ
గ్రహణాలు పట్టి విడుచు
అంతమాత్రాననే మనం
ఆపసోపాలు పడవద్దు
ఆ విడిచిన గ్రహణంలా
అడుగు ముందుకెయ్యాలి
ద్విగుణీకృత ఉత్సాహంతో
నడుం బిగించి కదలాలి
అవరోధాలనధిగమించి
చివరి వఱకు నిలబడగలగాలి.
అలుపు సొలుపు లేకుండా
గెలుపునెపుడు వరించాలి!

24-10-95
సంపూర్ణ సూర్యగ్రహణం



# కాకతి విభవము

కాకతీయ సామ్రాజ్య
ఘనకీర్తి వైభవాలు
చాటిచెప్పు రాజధాని
ఏకశిలా నగరము
వీరతకూ శూరతకూ
విజ్ఞాన విజ్ఞతలకు
సామ్రాజ్య రక్షణకూ
చక్కని పరిపాలనకూ
కాకతీయ రాజులదే
కాకలుతీరిన ఘనత
సంస్కృతీ ప్రియులువారు
చక్కని ప్రజా సంస్కర్తలు
వారిభక్తి భావమ్ముల
వారి కళా ప్రియత్వమ్ముల
వేనోళ్ళ చాటిచెప్పు
రుగల్లు పరిసరాలు
ర్మకొండ పట్టణమది
ఆనాటి కాకతి రాజధాని
ప్రసిద్ధ ప్రాచీన నగరము
చాళుక్యులందించిన వరము

ప్రక్కనే పద్మాక్షమ్మ గుట్టపై
చక్కని జైన విగ్రహముల
దిగంబర నిలువెత్తు రూపాలు
దీటుగ దర్శనీయములు
జినదేవత పద్మావతి పేర
మనుచున్న పద్మాక్షమ్మ గుడిపై
పెక్కుజైన శాసనాలు
చెక్కివున్న కారణాన
అక్కడ జైన ఆరామము
ఎక్కడో వెలిసి వుండెనని
అందులకే ఆ నగరము
ఆ రామకొండ - అర్మకొండ
అయ్యుండనోపునని
అనుకొంటారందరు
కాకతి మొదటి బేతరాజు
గరుడబేత రాజనువాడు
అనుమడు - కొండడు ఇద్దరు
అన్నదమ్ముల గెలచితాను
ఆక్రమించిన కారణాన
అనుమకొండయను పేరిడి

అచట రాజధాని నెలకొల్పెను
అప్పటినుండి ఆ నగరు
అనుమకొండ హనుమకొండగ
అలరారుచుండె నేటికిని
రాజకీయ మత విషయిక
రమణీయతలకిది ప్రసిద్ధి
ఈనాటికీ పరిపాలనకూ
నానా విద్యా విషయాలకూ
కాణాచియైన నగరంగా
వెల్గుచుండె హన్మకొండ.
నాటి తురక మష్కరుల
సుబేదారు నివసించిన
సుబేదారి నేటి ఏలిక
కలెక్టరు కార్యాలయము.
దీనికి ధరిదాపులనే
ప్రసన్న కేశవాలయము
ప్రసిద్ధిమౌ ఓ తటాకము
ప్రకటముగా వుండెనట.
ఆలయమది జీర్ణమయి
అంతరించి పోయినది
ఆ తటాకమే నేటి మేటి
బాలసముద్ర ప్రాంతమే మొ?

ఈ నగరున రుద్రదేవుడు
తానోగుడి నిర్మించెను.
వాసుదేవ, సూర్యదేవ
రుద్రేశ్వర విగ్రహముల
నాలయమున ప్రతిష్టించెను.
అదియే నేటికినీ అందంగా
అలరారు వేయిస్థంభాల గుడి
ప్రతిచోటా కన్పించును
అతి సుందర శిల్పాలు
ప్రవేశద్వార మండపాలు.
ప్రతి ఒకటీ శ్లాఘనీయాలు.
ప్రతి స్తంభంపై చెక్క
బడిన శిల్ప సౌందర్యం
ఆనాటి శిల్పుల కళా
కౌశలాలకు నిదర్శనం.
ఆలయమే అందమైన
శిల్ప కళా ఖండం
ఆలయ శిల్పాలకే అవి
అయినిల్చెను ఆదర్శం.
మన పూర్వుల ప్రాభవాల
ఘన గురుతుల నిల్పుకొని
మన చేతకాని తనాలనవి

మనకద్దంపట్టి చూపు.
శిథిలంగా చూడనాలయం
చివుకుమను హృదయం
సిగ్గుచేత ఏకముగ
శిరమగు అవనతం.
ఈ గుడిలో నుండి సీదా
ఏకశిలా రాజసౌధానికి
భూగర్భ రాజమార్గమది
భూరిగ నిర్మించారని
ఆ మార్గాననె రాజవంశం
ఈ గుడి దర్శించ వచ్చి
పూజలు సల్పి వెళ్ళేవారని
మురిపెంగా చెబుతారచ్చట.
హన్మకొండ వరంగల్లు
నడుమకొంత లోపలగా
అలరారుచున్నదో ఆలయం
భద్రకాళి గుడిపేరిట.
కాళిమాత అంశలందు
భద్రమేమొ ఈ రూపమందు
ఆలయం ప్రక్కనే ఆ పేరిటనే
వెలయుచున్నదో తటాకం.
మటియపాడ, వరంగల్లు
మరో రెండు నగరాలు
వర్తక వాణిజ్యాలిచట
వర్ధిలెనట ఆ రోజులలో.
రెండు నగరాలు నేటికీ
నిండుగ కలిసిపోయినా
వర్తక వాణిజ్యాలకే
పూర్తిగ అంకితాలవి.
వరంగల్లు దాటగనే
వచ్చునోరగల్లుకోట
కోటకన్న ముందు మనకు
దీటుగ కనుపించునవే
వీరభద్ర శంభుని గుళ్లు
ఈశ్వరానుగ్రహ లోగిళ్లు
కోటభద్రతకాచు కళ్ళు
రాజ్యరమ రక్షించు వాకిళ్ళు!
ఓరుగల్లు కోట తొలుత ప్రా
కారమది తనివితీర చూడగ
ఎంత మహోన్నతమొ మ
రెంతగ అతి దృఢమొ?
దానిచుట్టు పరిఖగూడ
దానికదియె సాటి కదా?
ఇదియకాక దీనివెనుక

ఇంకో రాతి ప్రాకారము
సంకటమది శత్రువులకు.
పరిఖ మరియు రెండు
ప్రాకారములు దాటి
పట్టణమున కాలిడయే
పగవాడికి సాధ్యమగునా ?
నేటికినీ నిలిచియున్న
కోటసింహ ద్వారము
నాలుగు సింహ ద్వారాలలో
నాణ్యమైనదీ ద్వారము
మేటి కళా శిల్ప నైపుణ్యము
కోటకే అదో సింగారము
బాటలో ఆహ్వాన తోరణము.
ఒకే పెద్దశిల, దానిపై
సకల హంగులతో నిర్మించిన
శిలా నైపుణ్య విలాసము
ప్రకటితమా రాజసౌధము.
రాజసౌధమంతయును
కుడ్య శిల్ప సౌందర్యము
కనులవిందు చేయుకదా
కాకతీయుల ప్రాభవము.
బురుజులు కట్టడాలు
గోపుర ప్రవేశ ద్వారాలు
హిందూ వాస్తు నిర్మాణత
కివన్నీ ఘన నిదర్శనాలు.
దుర్భేద్యమౌ ఈ కోటనుండి
దోర్దండ బలమునేలిరి
మొదటి కాకతీయ బేతరాజు
సదయుడు కాకతి రుద్రదేవుడు.
గణపతి దేవుడు, రుద్రమదేవి
చివరివాడు ప్రతాప రుద్రుడు.
ఆ పై తురుక ముష్కరులు
ఆరు నెలల పైబడి ముట్టడించి
అక్కసుతో బలగం పెంచి పెంచి
ఆ కోటను కొల్లగొట్టిరి
ఆ విధముగ అంతమాయెను
కాకతి విభవమంతయును.
గుళ్ళూ గోపురాలూ
గొప్ప గొప్ప తటకాలూ
కాకతి రాజులు నిర్మించుట
కాదావారి దూరదృష్టి
నీటికొఱత ఆలయాలు
నేటికినీ తీర్చగలిగిన
నిక్కమైన నిధులేకద ?

పాకాల ఒయ్యారం
రామప్ప లక్కవరం
మొదలైన తటాకాలు
వేయిస్థంబాల గుడి
రమ్యమైన రామప్ప గుడి
ఇతరములే చిన్నగుళ్ళు
ఎన్నో ఎన్నో ఎన్నెన్నో

ఈ కొలతలనే తీర్చును కద
కళింగ రాజ్యమొకటి తప్ప
కడమ తెలుగు ప్రాంతమెల్ల
ఏకఛత్ర పాలనగా ఏలిన
ఘనాఘన కీర్తది
కాకతి రాజులకే కదా
గర్వంగా ఘనంగా దక్కినది!

అంశమును గుర్తుచేసిన
సౌశీల్య సహృదయుడు
జగనుదోస్తు మహమ్మదు
అంకూసుగారికి కృతజ్ఞతలు!



(ఈ కవిత ఈ సంకలనంలో చోటుచేసుకొనుటకు సందర్భము నేను
ఓరుగల్లు పౌరుణ్ణవడమే) 26-10-95

# ఆంధ్రావని

నవంబరు ఒకటిరోజు
మనందఱికి మహానందం
ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం
అవతరించిన దినం!
భాషా ప్రయుక్త రాష్ట్రాల్లో
ప్రథమ పీఠం దీనిదే
దేశరాష్ట్ర పట్టికలో
దీనిచోటు మొదటిదే!
కాకముందు రాష్ట్రోదయం
మనమంతా మదరాసీలం
ఆ తరువాత తెలుగువారిగా
ఆరి తేరిన ఆంధ్రులం
ఆంధ్రకీర్తి కౌముదులవి
అవని ఎల్ల వ్యాపించినవి
ఆదినుండి మన ఆంధ్రులు
వీరశూరతకు ప్రసిద్ధులు
రుద్రమదేవినాటి నుండి
ప్రతాపరుద్రుని దాక
అల్లూరి సీతారామ రాజునుండి
ఆంధ్ర కేసరి ప్రకాశం వఱకు
అంతా శూరవీరులే
అంతా అనంత విశ్వాత్ములే
అంతా ఆదర్శ మూర్తులే
అంతా బహుగొప్ప వ్యక్తులే!
జాతీయ పతాకాన్ని
రూపొందించిన ఖ్యాతి
ఆంధ్రకు దక్కించారు
పింగళి వెంకయ్యగారు!
ప్రాణమొడ్డి స్వరాష్ట్రం
ఆంధ్రుల కాంధ్రరాష్ట్రం
దిట్టగ సాధించారు
పొట్టి శ్రీరాములుగారు!
ఎందరో మహానుభావులు
ఎందరో సంఘ సేవకులు
ఎందరో శాంతి కాముకులు
ఎందరో సమాజ సంస్కర్తలు
ఎందరో దేశోద్ధారకులు
ఎందరో నిస్వార్థ నాయకులు

ఈ గడ్డన జన్మించారు
గొప్ప బిడ్డలనిపించినారు
గొప్ప చరిత్ర సృష్టించారు
ఎప్పటికీ కీర్తిశేషులైనారు!
గోదావరి కృష్ణవంటి
గొప్ప నదుల జలాలను
తమయందు దాచుకొని
సమయోచిత తరుణాన
మేటి నీటి ప్రాజెక్టులు
దీటుగ తామందించగ
మిన్నగ పంటలు పండించే
అన్నదాత ఆంధ్రుడు!
సజ్జనుడూ సౌశీల్యుడు
శ్రమ జీవి ఆంధ్రుడు!
సహనశీలి సౌమిత్రుడు
సంఘజీవి ఆంధ్రుడు!
భాషా సంస్కృతులలో
మానేర్పరి ఆంధ్రుడు!

గౌరవ మర్యాదలతో
ఘనాఘనుడు ఆంధ్రుడు!
ప్రజ్ఞా పాటవాలలో
సుప్రసిద్ధుడాంధ్రుడు!
పరిశ్రమల రంగంలో
ప్రావీణ్యుడాంధ్రుడు!
ప్రపంచ దేశాలన్నట
ప్రఖ్యాతుడు ఆంధ్రుడు
ప్రకృతిసిద్ధ అందాలకు
భలే సదన మాంధ్ర!
ప్రకృతిసిద్ధ ఒనరులకు
బహుళ గర్భ ఆంధ్ర!
ఒనరులన్ని మనము
హానరుగ ఉపయోగించిన
మనమితర రాష్ట్రాలను
ఘనముగ అధిగమిస్తాము.
మన ఆంధ్రదేశమగును
మరో స్వర్గసమము!

ఆంధ్రప్రదేశ్ అవతరణ దినం 1-11-95



# నాగుల చవితి

మన ఆచారాలు
మన వ్యవహారాలు
నగుబాటుగ తోచే
మహా మూఢ నమ్మకాలు !
పాముకు పాలుపోసి
పెంచినట్లు అంటారు
నాగుల చవితి చూసి
పాలు పోస్తు వుంటారు !
విజ్ఞానం ఎంతగానో
వెల్లివిరిసి పోతున్నది
మన వెర్రి అంతగాను
మనల వెనక్కు లాగుతున్నది !
పాముకొక్కనాడు మనం
పాలుపోసినంత సది
మనల గుర్తుంచుకొనడం
కాటేయక పోవడం.
అజ్ఞానమన్నా అవాలి
అత్యాశన్నా అవాలి
లంచమిచ్చు ఆచారం
లక్ష్యమున్న కావాలి !
నవ్వాలో యేడ్వాలో
అన్నట్టి పరిస్థితి మూఢ
నమ్మకాల సంద్రంలో
నాశనమయే దుస్థితి !

4-11-9

✱

# నైతిక పతనం

నవంబరు పదునాల్గు
ఎవరికిది గుర్తుండదు
బాలల దినంగా నేడిది
బహుళంగా ప్రాచుర్యం
కాని యిది బాలల దినంగా
మారడానికే కారణం
అయిన ఆ మహనీయునినే
మఱచిపోవడమే దారుణం
జాతిపిత మహాత్ముని
రాజకీయ వారసునిని
మనజాతి ప్రథమ ప్రధానిని
బహుహర్షాలు మహనీయుని
మనమిలా మరవడం
కాదేమైనా క్షంతవ్యం
ఈనాటి వార్తలలో
యే కొద్దిగానైనా
ఆ మహనీయుని ఊసుగాని
ఆ మహనీయుని పేసుగాని
అగుపడనే లేదాయె
అతడంతగ కనుమరుగాయె
దేశ స్వాతంత్ర్య సమరంలో
దీక్షతో తెగ శ్రమించిన

ఆస్తిపాస్తులనూ శ్రీమతినీ
ఆ సందర్భాన కోల్పోయిన
లెక్కకు మించినన్నిసార్లు
జైలుకెళ్ళి చిక్కుల పడిన
ఎర్ర గులాబి షేర్వానీవాడు
దరహాస ధనియైనోడు
చిన్నారుల హృదులలోన
మిన్నగ నెహ్రూ చాచాయైన
ఇద్దరు ప్రధానులను దేశానికి
ఇచ్చిన మహిమాన్వితుడు
ఇద్దరూ టెర్రరిస్టుల పాడు
బుద్ధులకు బలియై పోగా
ఇద్దరూ తనవద్దికి చేర
ఎంతగాను కృంగినాడొ
అంతటి ఆ మహనీయుని
ఇంత త్వరగ మరచిన మన
వింత కుసంస్కారానికి
ఎంతగానొ సిగ్గుపడాలి
దాస్య శృంఖలాలు త్రెంచి
తగ స్వాతంత్రుల చేసిన
గాంధీనే మరుస్తున్న
ఘనులం మనం ఈనాడు
ఏమైనా చేయగలం మనం
దేనికైనా తగుతాం మనం
మానవత్వం విడుస్తున్న మనం
అనేనా మన ఈ పతనం
అయ్యెమా మనం మానవులం!

14-11-95 బాలల దినం నెహ్రూ చాచా జన్మదినం

# మహనీయ మహాత్ముడు

పుట్టపర్తిలో వెలసిన
పూజ్యుడు మహనీయుడు
అశాంతుల తొలగించే ఆ
ప్రశాంతి నిలయుడు
ఆధ్యాత్మిక సామ్రాజ్యాన్ని
కధిపతి ఆ మహాత్ముడు
ఆర్తత్రాణ పరాయణుడు
శ్రీ సత్యసాయి భగవానుడు
సత్యసాయి భగవానా అన్న
సందేహం వద్దే వద్దు
మిరాకిల్స్ నిజమా అన్న
మీ మాంస వద్దే వద్దు
మానవజన్మ లెత్తిన
మహనీయులెందరో
మహిమల ప్రదర్శించ
మనం నమ్మ నాముగా
అవతార పురుషులకు
అసాధ్యమేదీ కాదుగా!
దేవుళ్ళ మహిమలవి
తెలియనివా మనకవి
హుండీ తిరుపతిలో రోజు
నిండుట నిదర్శనం కదా!
అదే రీతి భక్తుల నుండి
అహరహం కానుకలను
సాయి భగవానుడు తను
సమకూర్చడం లేదాయేమి?
దేవుడిలా వుంటాడని
తెలుసునా ఎవరికైనా
మానవమేధ అద్భుత సృష్టి
మాత్రమే నిజంగా దేవుడని
మానవుని విశ్వాసమే
మహిత శక్తి దేవుడని
దీనుల కాపాడేవాడే
దివ్యుడని నేనంటా
దేవు డాతడేనంటా!
అహరహం మానవాళి ఆర్తు
లంతగ తీరుస్తున్నాడు
అనుమానం లేదు సత్యసాయి
అగును నిజం భగవానుడు!
అతను చేయు అద్భుతాలు

ఆస్తికతను పెంచు రీతులు
ఆయన దివ్య ప్రదర్శనలు
ఆయన సహజ శక్తులు
అయన భక్తులకు వరాలు
ఆయన వారికిచ్చు కానుకలు
ఆయన ఆచరించు పద్ధతులు
ఆధ్యాత్మికత పెంచు వ్యక్తులు
ఆయన దైవాంశ సంభూతులు
అనుటకు ఋజువులు కోకొల్లలు.
అసలు ప్రశాంతి నిలయమే
అదివో దివ్య దేవాలయము
మనసుల నాహ్లాదపఱచు
మహిమల ప్రేమాలయం
ఆ సాయి దివ్య జ్ఞానియే
అందు వెలసిన భగవానుడు
అంతా దివ్యాత్మ స్వరూపులే
అనే శక్తి సమన్వితుడు.
ఐకమత్య సాధన కొడు
అవసరమను మహనీయుడు.
సర్వమత సామరస్యం
సర్వమానవ సౌభ్రాతృత్వం
దివ్యమైన మానవత్వం

పూర్ణంగా విలసిల్లే
పుణ్యక్షేత్రం పుట్టపర్తి.
కులమత భేదా లేకుండా
ఇలలో గల జనులెందరో
ఇక్కడికి వేంచేస్తారు
శ్రీ సాయిని సందర్శిస్తారు
ఆయన ఆశీస్సులు పొందుతారు
ఆధ్యాత్మికామృతాన్ని
అతని నుండి సేవిస్తారు
ఆత్మానందం పొందుతారు.
మనలో ఎంతమంది చాలా
ఘనంగా సంపాదిస్తూలేం
అయినా దీనుల గుఱించి
ఆలోచిస్తున్నామా యేం ?
కనీసం మనవారి గూర్చైనా
ఖర్చేమన్నా చేస్తున్నామా
చిన్ని మన పొట్టలకే కదా
శ్రీరామ రక్ష మనది
అన్ని మన అవసరాలకే కధా
అచ్చివచ్చు ధనం మనది ?
అలాకాకుండా శ్రీ సాయి తను
ఎలాంటి అరమరలేకుండా

అహర్నిశలు దీన జనాళికై
ఆర్జించిన ధనమెంతో
వారి ఆధ్యాత్మికావసరాలకు
వారి విద్యావసరాలకు
వారి వైద్యావసరాలకు
వారి నీరు అవసరాలకు
కూరిమి వెచ్చించుచుండె
భూరిగ సమకూర్చినది.
నీటి కరువు నీతి కరువు
నిక్కముగా తీర్చుచుండె
అనంతపురం జిల్లాలో
ఘనంగా నీటి కొఱత తీర్చ
రెండువందల కోట్లపై బడి
మెండుగ వనరులు కల్పించి
జన్మదిన సందర్భాన
జాతికంకితం చేస్తున్న
దాహార్తి తీరుస్తున్న
దైవం సాయి భగవానుడు
నీతిగడువు తీరుస్తున్నాడని
నేనెందుకంటున్నానంటె
ున్నదితరుల కూడ్చిపెట్టుట
న్న నీతి వేరేమున్నది
ఎంత నీతియిందు నిగూఢం
సుంతైనా పాటిద్దాం మనందరం
నీతివచన ప్రవచనాల

నెన్నిటినో గ్రంధపఱచి
ఆధ్యాత్మిక ప్రవచనాలు
ఆత్మశ్లాఘనా భాషణలు.
నీతి బోధలెన్నిటినో
నిరంతరం చేయు భగవానుడు :
ఆయన సేవా సంస్థలన్నియు
నరుడే నారాయణుడనే
పరమార్థం నింపుకున్న
పవిత్రమైన ఆలయాలు !
ఆయన విద్యా సంస్థలు
విద్యాదాన మొనర్చు
విశ్వ విద్యాలయాలు
మానవతా విలువల
మహిత తెలుపు ఆలయాలు :
ఆయన వైద్యాలయాలు
సౌధరాజ స్వర్గాలు
పోవు ప్రాణములను నిల్పే
పుణ్యమైన ఆస్పత్రులు !
అందుచిత సేవలు చేయగ
ఆరాటపడుతున్నారు
ప్రపంచ నలుమూలల
ప్రసిద్ధులౌ వైద్యులు :
సాయి వైద్యాలయం
చక్కని ఆ చికిత్సాలయం
చూచి తరించాలే కాని

చెప్పడం అగు నసాధ్యం!
పైన వివరించిన వన్నీను
మానవమాత్రుని కసాధ్యమైన
పరమ కళా ఖండాలు
ప్రజంచ మహాద్భుతాలు!
ప్రభుత్వం చేయాల్సిన
పనులెన్నో తనుతానుగ
ప్రజలమేలు సదాకోరి
ప్రకటముగా చేయుచుండె!
పదునాల్గు నవంబరు నుండి
పదిరోజుల సంబరాలు
పలుప్రజాహిత కార్యక్రమాలు
ప్రారంభించు పుణ్య తిధులు
జన్మదినం ఇరవై మూడు వరకు
జరుగు వివిధ వేడుకలు!
పదిలక్షల భక్త సమూహం
ప్రపంచం నలుమూలల నుండి
వస్తారెవరి జన్మదినానికి!
వరప్రసాదానికన్నట్టు
ఇంతకన్నా యీ భువిపై
వింత వేరొకటున్నదా?
పదిరోజుల నిత్యాన్నదానాలు
అదీ వుచితంగా కల్పించనాలు
ఆ మహాత్మకే సుసాధ్యం
• (పాశ్చాత్యులను)

ఆ భగవానునికే కదా సులభం!
ఆయన జన్మదిన ఆతిథ్యం
అందుకున్నవారిదే అదృష్టం?
డెబ్బది వయసునకూడా
ఇబ్బంది యేమీ లేకుండా
సిబ్బంది పరిజనాలను
స్వచ్ఛంద సేవకులనూ
దొడ్డగ ప్రభుత్వ నేతలను
దొరలూ దొరసానులను •
ఇబ్బడి ముబ్బడిగా భక్తుల
రప్పించెడి ఆకర్షణతో
ఎప్పుడునూ ఎడతెగని
కుప్పలు దీనుల అవసరాలకు
గుప్పిస్తూ తన సంపదను
శతాధిక వుత్సాహంతో
ఆయురారోగ్య ఐశ్వర్యాలతో
సాయి భగవానుడు వర్థిల్లాలి
ఏడుపదుల జన్మదిన
వేడుకల సందర్భంగా
శ్రీసాయి చరణపద్మ
శ్రీ సన్నిధ కర్పణనా
ఈ చిన్ని కవితా కుసుమం
ఈ కన్నరి నమ్రహృదయం
అందుకో శ్రీసాయి
ఆదుకొనుమోయి!
*(జన్మదినం సందర్భంగా 23-11-95)

# వార్త

వర్తమాన సంఘటనలను
వార్తలు మనకందించును
వార్తలు మనకు దెచ్చుహరులు
వార్తా దినపత్రికలు
ఎంత ప్రాముఖ్యం వార్తలు
సంతరించుకొన్నాయంటే
మన దినమది మొదలగు
ఘనముగ వార్తలతోనే
"పేపర్" అని వినిపించనిదే
వార్తా పత్రిక కనిపించనిదే
ప్రపంచాన ఎందరో
ప్రక్కమీంచి లేవరు
ప్రాతఃకాలకౄత్యాలను
మరెందరో తీర్చుకోలేరు
టీ కాఫీల్లో వార్తలు నంజుకు
తినేవారు మఱికొందరు
కరకరలాడే బిస్కత్తుల
కొరికి తినే అనుభూతుల
కొందరైతే బ్రేక్‌ఫాస్టుతో
పొందుదురీ అనుభూతిని
కొందరు భోంచేసినాక
తొందరగా తాంబూలంలా
శీర్షికలను చదివిత్రేన్చి
శిఘ్రిమాఫీసెడతారు
సాయంత్రం తిరిగివచ్చి
సతీమణీ చాయంటూ
చాయ త్రాగుతూ మిగతా
చదవక వదలిన వార్తలు
చదివి మరీ తీరుతారు
చక్కగా ఆనందిస్తారు
రాత్రి నిద్రపోవు ముందు
రంజుగ ఇంకా కొందఱు
ముక్కుబడిగ తిరగేస్తారు
ప్రొద్దంతా వీలుకాక!
వీరికి ధనార్జనయే
భూరివార్త దినమంత!
ఈరీతిగ ఎల్లరుసూ
ఏదో ఒక వేళలలో
వార్తా పత్రికల చదువు
వారే ఈ లోకంలో
మనకున్నవి తెలుగున
ఘన వార్తా పత్రికలైనా
మనకున్న జనాభాకు
మరిన్ని తెలుగు డేలీలు
మనలనలరిస్తానంటే
మనకదియూ స్వాగతమే

4-12-95



# మానాటి సంక్రాంతి

చిన్నప్పుడు మావూళ్ళో
ఉన్నప్పుడు మాకంతా
సంకురాత్రి సంబరాలు
చక్కని ఓ వినోదాలు !
"సం" క్రాంతి అదేదో
సంక్రాంతిలో వుండేది !
ధాన్యలక్ష్మి గాదెలలో
దట్టించి నిండేది !
చేతినిండా ప్రజలకు
చిల్లర డబ్బుండేది !
అన్నదాతా సుఖీభవ
అన్నది మన సంస్కారం
ఆ రోజులలో పశువులే
అన్ని పొలం పనుల
అన్ని చేల పనుల
అవసరాలు తీర్చేవి !
మోటబావిలో నుండి
నీటిని తోడుటకు
నాగలి గొర్రులతో
సాణ్యంగా దుక్కిదున్న
పండిన పంటలను
బండీలతో ఇంటచేర్చ

కచ్చడాలలో జనాలు
ముచ్చటగా ప్రయాణించ
పండించిన సరుకులను
పట్నాలకు తరలించ
ఒక్కటేమి వ్యవసాయపు
మిక్కిలి పనులెల్లను
పశుసంపదయే మాకు
చేసిపెట్టు చుండెడిది !
అందుకే వాటినన్నిటి
అలంకరించి ఆదరించి
చివరకు పూజలు కూడా
చేయువారు ప్రజలంతా
వాటికి కావలసిన
కుడిదులూ- దాణాలు
దీటుగ సమకూర్చి
వాటి ఋణం దీర్చి
వాటివల్ల వీరంతా
వీరి వల్ల అవియన్ని
మహా మహా ముచ్చటగా
వర్థిల్లెడి వారు సదా !
అంగసలెంతో ముద్దుగ
ప్రాంగణముల బొద్దుగ

తెల్లవారిపోకముందె
తీర్చిదిద్ది ముగ్గులతో
గొబ్బెమ్మలనందులోన
పబ్బముగా ప్రదర్శించ
ప్రజలవి త్రొక్కకుండ
ప్రమిదలు పడే పాట్లు
త్రొక్కిన ప్రజలకు వారు
తిక్కతిక్కగా పెట్టే తిట్లు
వారికి వీరికి మధ్య
వాదోపవాదాలు
చూచువారి కందరికీ
చోద్యమైన అనుభవాలు !
ఆపై వెనువెంటనె
అలంకృత గంగిరెద్దు
"అయ్యగారికీ దణ్ణం బెట్టు"
అనగానే ప్రమోకరించ
దోసిళ్ళతో దానికని
దొడ్డగజోలెలు నింపి
తిరుగుచూచునంతలో
హరిదాసు కనిపించు
"హరిల్లో రంగ హరి"
"కృష్ణార్పణం" అనుచు
దోసిళ్ళతో హరిదాసుకు
పోసి పాత్రలోతండులాలు
సంతసించువారు ప్రజలు
చక్కగ పండుగ చేసికొని !
అల్లుళ్ళూ బిడ్డలూ
కొడుకులు కోడళ్ళూ
మనువరాళ్ళు మనుమలూ
మాతాపితరులూ
అక్కా చెల్లెళ్ళూ
వారి వారి సంతానం
అంతా యెంతో ముచ్చటగా
ఆనందోత్సాలతో
ముద్దూ మురిపాలుతీర
హద్దులేని ప్రేమమీర
జరిపి సంక్రాంతి పండుగ
ఆనందించేవారు మెండుగ !
ఆనాటి సంక్రాంతి
ఆ ఆనందం సందోహం
ఈనాడు కాంచుట
ఏకంగా సందేహం
ఆనాటి ఆ ముగ్గులు
ఆ హంగు గంగిరెద్దులు
ఆ గొప్ప పశుసంపదలు
ఆ నిండిన గాదెలూ
ఆ పుణ్య హరిదాసులూ
ఆ ప్రేమ హృదయాలూ
ఆ ముద్దు మురిపాలూ
అవి నేడు శూన్యాలు
చివికేను హృదయాలు !

15-1-96

★

# అస్తమించె వందమూరి తారక

ఎంతో మహోన్నత
ఎత్తులలో కెగసిన
ఏకైక సినీ రాముడు
ఎన్టీఆర్‌గా ప్రసిద్ధుడు
అంతే అకస్మాత్తుగ
రాలె అనుకోకుండా
సినీవినీల గగనాన
తారలలో రారాజుగ
తానెంతో యశమొంది
రాజకీయ రంగంలో
రంజుగ కాలును మోపి
ఖ్యాతి అపఖ్యాతుల
కలగలిపి అనుభవించి
గండం తట్టుకోలేక
గుండె ఆగి మరణించెను
అనుకున్నదేమిటి
అయ్యిందేమిటి
దురాశ దుఃఖం చేటు!
మంచికుండదు లోటు!

16-1-96



## జనవరి 26

ప్రపంచ దేశాలన్నిటా
గణుతెక్కిన మహా
గణతంత్ర రాజ్యం
మన భారతదేశం
నలభై తొమ్మిది వసంతాలు
నిండిన ఆ సంబరాలు
చూడ వచ్చు ఢిల్లీలో
ఇంద్ర ధనస్సు రంగుల్లో
ప్రతిసారి విన్యాసాల్లో
గణతంత్రానికి కాక
రణతంత్రానికే ముఖ్యంగా
ప్రాముఖ్య మిచ్చినట్లు
ప్రాచుర్యం జరుగుతుంది
శాంతి శాంతి అంటుంటే
అశాంతి భూతం పెరుగుతుంటే
కోట్లనోళ్ల ఆకలితో
ఓట్లు యిచ్చి గెలిపించిన
ఘనమైన మననేతలు
మన రాజులు, రారాజులు
ఇవాళో కుంభ కోణం
రేపింకో హవాలా
కుంభకోణాల కాదర్శులై
కోట్లకు కోట్లు మింగుతుంటే
"జై సారాజావైసా
ప్రజా" చేసి పాలిస్తూ
ప్రపంచ దేశాలన్నిటా
అవినీతికి యీ దేశం
ఆదర్శం అగునట్టుల
ఆగని అన్యాయాల
పరేడ్‌లే చేస్తున్నారు
ప్రజా ధనం దోస్తున్నారు
సజావుగా సాగుతున్నారు
ప్రగతి కుంటు చేస్తున్నారు
కంచెయే చేను మేస్తే
మంచినే వెలివేస్తే
దుర్మార్గం మోసాలే
ద్రోహాలు దౌర్జన్యాలే
చలామణి ఔతుంటే
ఎలా యింక ఈ దేశం
ఈ దేశం జన సమర్థం
ముందుకెళ్ళ గలుగుతారు
ముక్తి పొందగలుగుతారు



# పూజ్య బాపుజీ

జనవరి ముప్పై కదా ఈరోజు
మనకిదెంత దౌర్భాగ్యపు రోజు
మనకు స్వతంత్ర జన్మనిచ్చిన పూజ్యు
మనమే చంపుకున్నదీపాడు రోజు
గాంధీజీని ఘోరంగా తానారోజు
గాడ్సే అనే పశువు చంపిన రోజు
తండ్రినే కొడుకు వధించిన రోజు
జాతికే పిత జన్మ చాలించిన రోజు
దేశమే దిగ్భ్రాంతి చెందినదా రోజు
దిక్కుతోచక ప్రజలంతా ఏడ్చిన రోజు
బాపూజీలాంటి పూజ్య మానవుడు
బాధల తీర్చునట్టి పురుషోత్తముడు
యుగానికొకడె కదా జన్మిస్తాడు
తన పని కాగానే తనువు చాలిస్తాడు
అలాగే మన మధ్యకే తెంచాడు
ఆంగ్లేయుల దేశం నుండి తరిమినాడు.
దశావతారాలలో విష్ణువేంచేశాడు
అదేకదా బాపూజీ అనుసరించాడు
అందుకని ఆయనదీ ఓ అవతారం
అని యెందుకనకూడదంటారు మనం?

30-1-95



# కాలచక్ర గమనం

ఇంగిలీషు వత్సరాలు
ఎంతలేని అనంతాలు
సంఖ్యారోహణ క్రమమున
శతాబ్దాలు పెరుగుచుండు
హైందవ సంవత్సరాలిదే
పొందికలో వచ్చి పోవు
శాలివాహన శకంగా
సంవత్సరాలు పిలువబడు
ప్రస్తుత ఆంగ్లవత్సర
సంఖ్యాతీరు
పందొమ్మిది వందల
తొంభై ఆరు
పందొమ్మిదివందల
పదిహేడు
ప్రస్తుత శాలివాహన
శకం యేడు
జగాన ఎవరి వారి
ఉగాదులు చేసుకున్నా
ఎవరికాంగ్ల సంస్కృతే
చెల్లుబాటులో వున్నది
ఆంధ్రులం మనకందంగా
అరవై సంవత్సరాలు
అదియే తిరిగి తిరిగి

అవధరించు ఉగాదులు
ప్రతి వత్సరమూ ఒక
ప్రత్యేక పేరుతో వచ్చు
ప్రభవాది అక్షయలలా
ప్రచురమైన వత్సరాలు!
కాలచక్ర గమనంలో
కలిసిపోయె మరో యేడు
యువనామ వత్సరం
యువత నింపి మనలో
సంవత్సర కాలం మన
సంపర్కంలో తను గడిపి
ధాతవత్సరానికది
తలయొగ్గి వెళ్ళినది
"యువ" మనకేమచ్చెనో
ఎవరికి వారే తము
బేరీజు వేసుకోవాలి
క్షేమగ తృప్తి చెందాలి
నిరాశా నిస్పృహలను
నెట్టివేసి ఎదగాలి
ఈ నూతన సంవత్సరము
ధాతనామ వత్సరము
మన విధాతలాగానే
జనసృష్టిని పెంచునో?

ఘనుడాదిత్యునిలాగా
మనకు వెలుగునిచ్చునో!
తరుగుచున్న విలువల
తప్పుదారి నడకల
తప్పించి మనలను
తగినరీతి రక్షించునో ?
వేచి చూడవలసినదే
వేయిమాటలేల మనం
మునుముందుగ తలవడం!
తినబోతూ రుచులడగడం!
మానవతా విలువలు
మరీ త్వరగ నశిస్తుండె
ఇతరులకై తపించదు
ఇచట ఎవరిగుండె!
చిన్ని మన పొట్టలకే
శ్రీరామ రక్ష
అన్నదే యీనాటి
మనందరి-కు శిక్ష!
కొరతలతో మనం పడే
కొరకొరలిన్నా అన్నా
కూర్చుకున్న వాటికన్నా
కొరతలే మనకు మిన్న!
అందు ముఖ్యమైనవారే
అన్నిటినీ చర్చింతము
ఇతర కొరతలగూర్చి
యింత రభస చేస్తాము
ముఖ్యమైన నీతికొరత
ముచ్చటే పట్టించుకోం ?
మనకున్న సమస్యలలో
ప్రథమ పీఠమే దీనిది
బోఫోర్సులూ ఎన్రాన్‌లు
కృష్ణపట్నాలు హవాలాలు
నీతికొరత కారణాలు
నేటి ఈ కుంభకోణాలు!
దీని కొరత ఏరీతిని
తీర్చగలము మనమన్నది
తమరంతా మేధావులు
తమ కవి మేధస్సులు
తట్టిలేపి చర్చించిన
తగినదేదో పరిష్కారం
తప్పక లభిస్తుంది
తక్షణం పూనండీ
క్రాంతిపథం చూపండీ
కవివరులకె ఇది సాధ్యం
కవిశ్రేష్ఠులు మీరంతా
కాదేదీ అసాధ్యం.
నీతి సమస్యను తీర్చేస్తే
నిలచియుండునిదే కొరతలు
ప్రతీక్షణమూ పుట్టుకల
అతి జనాభా సమస్య

అతిగా దేశాన్ని బాధించ
మితిమీరుతున్న సమస్య!
కాలుష్యం మనమీదికి
కత్తిదూసి వస్తున్నది
కలుషిత వాతావరణం
జలధ్వని కలుషితాల
రూపంలో యిది మనకో
పాపమయి గూర్చున్నది!
నిత్యావసర వస్తు ధరలు
నిలకడయే లేనివి
నింగినంటి పోయినవి!
త్రాగునీటి కొరత మనల
బాగుగ బాధిస్తున్నది
దినం విడిచి దినం నీళ్ళు
అదీ సిటీలో సగం మందికే
అంటే నాల్గవ భాగానికే
అందేది కుళాయి నీళ్ళు
గతా మూడుపాళ్ళమంది
రింగులతో పడే యిబ్బంది
ఇంతా అంతా వర్ణించే
టంత శక్తి నాకు లేదు!
ఇన్ని నదుల దేశంలో
నదులనన్ని సంధించాలని
కోకొల్లల జల సంపద
కొంతకూడ అనవసరంగ
అంబోధుల కలువకుండ
ఆపాలను ప్రతిపాదన
నానామార్లు కేయల్ రావు
నెత్తిన నోరెట్టుకొని
ఒత్తిపలికెమంత్రిగా!
ఆ పని చేసేంతవరకు
ఈ పరిస్థితి నీటిదింతే!
ఇక కరెంటు తీరు చూస్తే
ఏమున్నది బాధాకరమే
నీరులేక అదికూడా
నీరుగారుస్తున్నది మనల
నీటికంటె దీనితీరు
నిక్కముగా మేలేమరి
నాల్గింట మూడుగంటలు
నల్గురిలో ముగ్గురికే
వందకు డెబ్బైయైదు మందికి
సుందరముగ సౌలభ్యము
కనీసం సగం రోజైనా
కావల్సినపుడు లేకున్నా

పల్లెలలో గూడా యిది
పదుగురికీ అందుతోంది.
జలవిద్యుత్తు నెక్కువగా
మలుచుకున్న కారణాన
నదుల నీరు మనకంత
ఒదుగుకాని తరుణాన
విద్యుత్కొరత మనకంత
మిక్కుటమై పోవటాన
రోజు కారుగంటల తరి
రోకో విద్యుత్ కారణాన
ఇబ్బంది అందరికీ
ఇబ్బడి ముబ్బడవటాన
విద్యుత్ సంస్థ పరిస్థితి
విపులంగా తెలిసిన
విజ్ఞులు వాడుకదార్లు
సంస్థతో సహకరించి
అవసరమైనంతే అందరూ
అచ్చముగా వాడుకొని
విద్యుత్ చౌర్యంలాంటి
వెర్రిపనులు చేయకుంటే
సంస్థకేకాదు సహజీవులందరికీ
సౌకర్యం కల్పించిన
సౌశీల్యుల మౌతాము
పొదుపు చేసినంత విద్యుత్తు
పుట్టించినంత ఘనం
ఇలా కొరత తగ్గించి మనం
కొంత ఉదారత చూపుదాం!
ఆరుగంటల కోత
అర్థంలేనట్టున్నా ఇకమీద
ఆరుగంటలే యిచ్చినా
ఆశ్చర్యమక్కరలేదు
తప్పని సరిగా మనం
తిప్పలెన్ని పడుతున్నా
ఆపసోపాలు పడుతూ
అలవాటు పడిపోతాం
అపుడెపుడో ఒకరాత్రి
అమెరికాలో కరెంట్ పోతే
ఆపై పదినెలలకు
ఆ దేశం జనాభా
అద్భుతముగ పెరిగిందట
అదేమని విచారిస్తే
అంధకార బంధురంలో
కరెంటు పోయిన తరుణంలో
ఖచ్చితంగా ప్రజలంతా
రేతిరంతా ప్రొద్దుపోక
రేతమాట ఆడారట!
కోత మనదీ విద్యుత్తుది
రోత పుట్టిస్తున్నట్టి

అతి జనాభా సమస్య పెంచి
మతి అలా పోగొట్టకుండు గాక
ప్రతి వత్సరములాగే
ధాతవత్సరం కూడా
ధగధగా వచ్చినది
ఉగాది పండుగ తెచ్చినది
వత్సరాన ముమ్ముందుగ
వచ్చె ధాత మన యింటికి
అతిధికాని అతిధి మనకు
ఆహ్వానించడమే కాక
ఆదరించడం మరి మ
ర్యాదలు చేయడం మనవిధి
అందుకనే అందరం
అందమైన డెందాలతో
వాహ్వాయను రీతిగా
ఆహ్వానిద్దాం ధాతను
అది మనకే మిచ్చునో
కష్టాలూ నష్టాలూ
కావల్సినన్ని సుఖాలూ
పులుపూ కారం చేదూ తీపి
కల- ఉగాది పచ్చడి రీతి
కలగా పులగంగా- మనం
కలిపి స్వీకరించుదాం
ఘనముగ ముందంజ వేద్దాం
మన- కలలను- పండించు-
కొందాం

ధాత ఉగాది 20-3-96



## బాపూజీ

ఇలాగే నా ఇలాగేనా మనం
పూజ్యబాపూజీని గౌరవించడం
ఆయన వద్దన్నా వినకుండా
ఆయన పుట్టిన తేదీ సెలవు పాటించడం!
ఆ మహాత్మునికింత కన్నా
ఆ గౌరవముందా యేమన్నా
ఆయన వద్దంటే వినక చేసుకున్నాం
పాకిస్తాన్‌నో ప్రక్కలో బల్లెం
ఎంత దూరమాలోచించి
ఎంత ఆ మహనీయుడూహించి
దేశ విభజనకు అడ్డగించాడో
తెలిసేదెపుడు మనకా మంచి! 2-10-96

# బతుకమ్మ పాట

బతుకమ్మ బతుకమ్మ ఉయ్యాలో
మా బతుకు పండించు ,,
రంగు రంగుల పూల ,,
తంగేడు పూలతో ,,
గునుగు పూవులతోని ,,
ముద్దుముద్దగు పూల ,,
ముద్దు మురిపాలతో ,,
బతుకమ్మ నిను మేము ,,
బహు అందముగ పేర్చి ,,
పట్టుకొచ్చితి మమ్మ ,,
బహుభక్తి నాడుటకు ,,
ఎంగిలీ పూలతో ,,
రంగమూ మొదలాయె ,,
తొమ్మిదీ రోజులూ ,,
అమ్మ నిను పూజించి ,,
సద్దులనాడు నిను ,,
సాగనంపెద మమ్మ ,,
మాపైన దయచూడు ,,
మమ్ము దీవించమ్మ ,,

మాయమ్మ బతుకమ్మ ఉయ్యాలో
మమ్ము రక్షించమ్మ ,,
పిల్లలను పెద్దలను ,,
చల్లగా కాపాడు ,,
మాకు సౌభాగ్యాలు ,,
మాకు ఐశ్వర్యాలు ,,
ఈయవే మా తల్లి ,,
బతుకమ్మ మాయమ్మ ,,
తల్లివై మము నీవు ,,
ఎల్లప్పుడు బతుకమ్మ ,,
ఆనందమగునట్లు ,,
ఆశీర్వదించమ్మ ,,
బతుకమ్మ బతుకమ్మ ,,
మా బతుకు పండించు ,,

20.10.96



# మంత్రిదండం మనమిక చూడం

స్వయంగా ఓ పార్టీ పెట్టి
సంవత్సర సమయంలోనే
ఆంధ్రరాష్ట్ర పగ్గాలను
ఆయన చేతులలోనికి
లాగుకొన్న లావు మనిషి
ఎన్టీఆర్ కరముల నుండి
అంతగానే అలీవలగ
ఆపగ్గాలను తిరిగి
లాగి వేసుకున్న ఘన
రాజకీయ ధురంధరుడు
మంత్రి చెన్నారెడ్డి గారు
మనకిక పై కనిపించరు
మన స్మృతులలోనె మనెదరు!
మంత్రి నాయనా నీ దండం
మకందరికి చేసి దూరం
వేల్పులకే గవర్నరుగా
వెళ్ళితివా సత్వరం
గొప్పనీ రాజనీతికి
గుండెలు వారివి గుభిల్లన.
పెద్ద మంత్రి ఆంధ్రావనిది
పెకళించుకు పోయింది
ఆయన స్మృతికి అంకితం
ఆంధ్రరాష్ట్ర మహా జనం
సకలబల ఆయన ఆత్మకు
సదా శాంతి చేకూర్చుటకు
ప్రార్థిద్దాం మనమంతా
ప్రాప్తించ స్వర్గమాయనకు!

4-12-96



# క్రీస్తు భగవానుడు

ఏసుక్రీస్తు
బుద్ధుడు
మహాత్ముడు
ఈ ముగ్గురు
మానవాళి
సుఖం కొఱకు
మనినట్టి
మహాత్ములే
ఆశయ
సాధనకై
అన్నిటినీ
వదిలినారు
ఆధ్యేయంలో
ఐనారు ధన్యులు !
అందుకే వీరు మనకు
ఆదర్శ మూర్తులు
వీరి దారులే
మనకు సదా
ఆచరణ
 ాగ్యములు !
 ిరికి వందల
వేల ఆమడల

దూరంలోనైనా
ఉన్నామా మనం ?
వీరిలాంటి
కృషిని మనం
యేల చేయవూనము ?
వీరిలాగ
ఆర్తుల సేవలు
ఏల మనం
చేయము ?
పుట్టినపుడు
వీరంతా
మానవులే
చేతలతో
ఐనారు
చిత్రముగా
మహనీయులు !
మానవత్వ
ముట్టిపడిన
మహిత మహా
మహిమాన్విత
మాననీయులు !
బెత్లెహములో
గొర్రెలపాకలో

ఉదయించిన
ఆ భానుడు
అంతగ ఎదిగి
తాను ఐనాడు
దయామయుడు !
అందరికీ
ప్రియుడా
ప్రేమమూర్తి
మనందరికీ
ఆదర్శమూర్తి !
చక్కని హృదయం
శాంతీ సౌభ్రాతృత్వం
మిక్కిలిగ ఉండాలని
బోధించి ఏసుక్రీస్తు
తానాయెను భగవానుడు !
జనులందరి బాధలను
తనకిమ్మని వచించాడు
ఎందరికో ఆరోగ్యం
పొందునట్లు చేశాడు!
వారి దుఃఖములు
తీర్చగ తాను
భూరి కృషిని చేశాడు
శిలువపై నిలిచితాను
చిత్రవధలు మోసాడు!
అయినా తనను గూర్చి
బాధపడొద్దన్నాడు
అందరినీ తమ పిల్లలగూర్చి
ఆలోచించమన్నాడు!
సైతానుల చేతులలో
చిక్కియుండి కూడ తాను
వారి ఘోర దుర్మార్గాన్ని
అజ్ఞానంగా కొట్టివేసె?
మనలో ఎందర మతనిలా
ఇతరుల బాధలు తీరుస్తున్నాం
మనవారి బాధలైనా
మనమేమన్నా తీరుస్తున్నామా
మనచిట్టి పొట్టలకే కదా
మనం సదా రక్ష
మన ఎదుగుదలే కదా
మన గమ్యం కక్ష!
ఇతరుల కన్నీరేమన్నా
ఎప్పుడైనా తుడిచితిమా
ఇతరులకే మేలైనా
చేసి మనం ఎరుగుదుమా?
ఏసుక్రీస్తులాగ మనం
ఏండ్లకొద్ది పూండ్లకొద్ది
ఈ రీతిగ నిలిచెదమా?
ఏం చేశామని మనం
మనం మనగలం?

25-12-96

# జగమంతా పండుగ

జనవరి ఒకటవ తేదీ
జగమంతా పండగరోజిది
ఆంగ్ల సంవత్సరం క్రొత్తది
అవధరించిన దివమిది
పందొమ్మిది వందల తొంభై యేడది
పరుగున మనకై వచ్చిన రోజిది!
మొత్తం ప్రపంచమంతా
మోదంతో చేసుకునే
ఒకే ఒక పండగిదన్నది
సకలురకూ తెలిసినదే!
మొదటి దినం వత్సరాన
ముదముగ చేయు పనులను
వత్సరమంతా గూడా
ఉత్సాహంతో చేస్తారని
నానుడి మన మధ్యన
నాణ్యముగా వున్నదే!

అందుకే మనమందరం
పొందికగా రోజంతా
మంచి పనులనే చేద్దాం
పంచుకొందాం ఆనందం
సంవత్సరమంతా మనం
సంతోషంగా గడుపుదాం!
పాత వత్సరం చేసిన
మంచిచెడులు మనమంతా
బేరీజు వేసుకుందాం
భేషుగ దాన్ని పంపిద్దాం
కొత్త వత్సరం మనకు
కొని తెచ్చేదంతయును
మంచియనే ఆశిద్దాం
మనసారా స్వాగతిస్తాం
శుభాకాంక్షలు తెలుపుకుందాం!

1-1-97



# నేటి భారతం

భారతదేశ స్వతంత్ర
సంగ్రామ చరిత్రలో
నేతలంతా ఒకెత్తయితే
నేతాజీ మహోన్నతుడు
ఆశయ సాధనకు
అహింస మంచి మార్గమైనా
అత్యవసర సమయంలో
ఆత్మ రక్షణార్థం
గీతాచార్య సూత్రం
శత్రు మహా సంహారం
చక్కని అవసరమని
భావించి ఆచరించిన
మహాజ్ఞాని నేతాజీ
శత్రువు మొండివాడై
సాయుధ బలాల్ని
సమగ్రంగా గుప్పిస్తుంటే
సత్యాహింసలంటూ
చక్కని దేశపౌరుల
చుక్కల ఆణిముత్యాల
ధీబల శాలుల

దేశభక్తుల కోల్పోయి
దీనులమైనాం మనం
వారందరిలో మిన్న
నేతగా పేరు పొందిన
ఘన నేత నేతాజీ
గొప్ప మానవతావాది
మహా సమైక్యతా వాది
శౌర్య పరాక్రమశాలి
చక్కని స్నేహశీలి అని
ఆయన అనుయాయులు
అంతా తెలుపుతుండే
ఆయన దీక్షాదక్షతలు
ఆచరించ యోగ్యములు.
ఆయన నకాలమరణం
అపహరించిందనుకోను
కక్షతో యే కుశక్తో
కబళించే ఉద్దేశంతో
విపరీత వికృత
వ్యూహంపన్ని గగనంలో
విధి దారుణమునుకునేట్లు

విమానం కూల్చి ఉండాలి
అంతటి సమర్థుడు
ఆయన నేతృత్వంతో
ఈ దేశం పరిస్థితి
ఈ రీతిగ కాకుండా
ఎంతో మహోజ్వలంగ
ప్రపంచంలోనే ఆదర్శ
ప్రదంగా వుండేది.
ఏబదేండ్ల స్వతంత్రంలో
ఇదీ సాధించింది.
కంచె చేను మేతలు
కంపులేపు నాయకులు
నిత్య కుంభకోణాలు
నీతి రహిత కార్యాలు
నీవే ఉండుంటే ఓ
నేతాజీ బాగుండేది
ఇంతగ అధ్వాన్నస్థితికి
ఈ దేశం రాకుండేది
ఇప్పటికీ నీలాంటి
నేత- నియంత అవసరం
తప్పదీ దేశానికని
మా అందరి అభిమతం
నూరేళ్ళ క్రిందటిలాగే నీవు
ఈ రోజెందుకు జన్మించవు
తక్షణం ఎదిగి వచ్చి
ఆనాడాగిన చోటినుండి
ఆరంభించు తిరిగి నీ పనిని
ఈ తక్షక భక్షకుల
రక్షణలన్నీ లాగేసి
రాక్షసాంతం చేసి
రక్షించు దేశాన్ని
ఇపుడీ నల్లదొంగల నుండి.

(నేతాజీ సుభాష్ చంద్రబోస్ శత
జయంతి సందర్భంగా 23-1-97)

★

## విడుదలైన కవిగారి రచనలు

| | |
|---|---|
| 1. కవిగారి స్వగతాలు | నాతో నలభై యేళ్ళ సన్నిహితంగా మెలిగి నా వాళ్ళపై కవితలు (80 వరకు) |
| 2. కవిగారి సందర్భ స్వరాలు | 1995 సం॥లో వచ్చిన అన్ని సందర్భములపై కవితలు (జాతీయదినములు పండుగలు వగైరా) |

## త్వరలో విడుదలకానున్న 'కవిగారి' రచనలు

| | |
|---|---|
| 3. **Yours Lovingly - I** | శ్రీ శర్మాజీగారి తెలుగు ప్రేమ కవితల 'నన్ను నీకిచ్చేశాను' సంపుటి ఆంగ్లానువాదం. |
| 4. **Yours Lovingly - II** | ,, ,, |
| 5. **Brainy Brights - I** | ఆచార్య సినారె గారితో మొదలిడి ఇతర కవుల తెలుగు కవితల ఆంగ్లానువాదాలు |
| 6. **Brainy Brights - II** | ,, ,, |
| 7. ఉర్దూ కవితలు | స్వీయ రచనలు మరియు ఇంగ్లీషు. తెలుగు నుండి అనువాదాలు. |
| 8. తుషార తోరణం | తెలుగు కవితలు- స్వీయ రచనలు |
| 9 తురుష్క తుషారము | గాలిబు మరియు యితర ఉర్దూ కవుల గజల్, రుబాయీల అనువాదాలు (తెలుగులో) |
| 10. మనసు-మగువ-మదిర-తుషారము | స్వీయ కవితలు |
| 11. సూక్తి సుధా తుషారము | ,, ,, |
| 12. మనోజ మనోజ్ఞములు-I | ,, ,, |
| 13. మనోజ మనోజ్ఞములు-II | ,, ,, |
| 14. మనోజ్ఞ తుషారము | అనేకానేక రచయితల / ఆంగ్ల ప్రవచనాలకు తెలుగు కవితా రూపం |

15. మనోగతము — ప్రసిద్ధ ఉర్దూ, హిందీ పాటల తెలుగు అనువాద గేయాలు

16. మహితోక్తి తుషారము — ఇతర భాషా కవుల రచయితల మహత్త్వ పూరిత బావతరంగాలు తెలుగు కవితా సంపుటి.

17. స్వర్ణగోపాల శతకము — 108 మానవతా విలువల తెలిపిన శతకము

18. జీవితంతో పోరాటం — ఆత్మకథ (తెలుగు)

19. లైఫ్-ఎ స్ట్రగుల్ — ఆత్మకథ (ఆంగ్లం)

20. హాస్య తుషారం — పకపకల ప్రహసనం

21. గీతా మకరందము — భగవద్గీతలోని ప్రసిద్ధ శ్లోకములకు తెలుగు వెలుగులు

22. కదంబ తుషారము — పై వాటిలో నిమడని అన్ని యితర కవితలు !



## తప్పొప్పుల పట్టిక

| పేజీ | లైను | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 13 | 11 | ప్రవర్తనకు | ప్రవర్తకు |
| 25 | 4 | సమాజం-తెలిసే | సమాజం-తెలిపే |
| 33 | చివరిమండి 3 | నీటి కొరత ఆలయాలు | నీతి కొరత ఆలయాలు |
| 34 | చివరినుండి 13 | ఇతరముతే | ఇతరములో |
| 35 | ఎడమచివర | సీతారాద | సీతారామ |
| 2 | ఎడమచివర నుండి 7 | నీతి గరువు | నీతి కరువు |
| 43 | 1 | నసాద్యం | నసాధ్యం |
| | 5 | ప్రజంచ | ప్రపంచ |
| 44 | 13 | క్యాత్యాలను | కృత్యాలను |
| 57 | కుడి 1 | మకందరికి | మాకందరికి |

| పేజీ నెంబరు | లైను | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| నంబరు లేని 2వ పేజీ | 4 | గోసాల | గోపాల |
| కృతజ్ఞతా చందనం | 13 | పొందిన | పొదిగిన |
| సర్వసందర్భ సుస్వరాలు | 13 | బలం | కలం |
| ఉరుములేని మెరుపు | 5 | ,, | ఒక |
| 17 | 13 | కట్టీనాక | కట్టినాక |
| 32 | చివర | 2వ ఈ | రా |
| 25 | 4 | సమూజం | సహజం |
| | | అని తెలిసే | అని తెలిపే |
| 25 | 8 | మంచిపునెడు | మంచినెపుడు |
| 33 | చివరినుంచి 3 | నీటి కొరత | నీతి కొరత |
| | | ........... | నీటి కొరత తటాకాలు |
| 37 | 12 | లాగుతుప్నది | లాగుతున్నది |
| 44 | ఎడమ చివరనుంచి 3 | తొంధరగా | తొందరగా |
| 44 | ,, చివరలైను | శిఘ్ర | శీఘ్ర |
| 50 | చివరినుండి 10 | మనకే మచ్చెనో | మనకేమిచ్చెనో |
| 51 | ,, 3 | యుంటునిదే | యుండునైదే |
| 52 | ,, 5 | ముగ్గరికే | ముగ్గురికి |

